

ఇంటిని రణరంగంగా మార్చేది ఆడదే, అదే ఇంటిని శాంతి నివాసంగా మలచేది ఆడదే.
సుఖ దుఃఖాలకు "ఆడదే ఆధారం"
ప్రొడక్షన్స్
ఆడదే ఆధారం
కథ స్క్రీన్‌ప్లే-దర్శకత్వం
విసు
నిర్మాత
ఎ.పూర్ణచంద్రరావు
ఆకెళ్ళ · సీతారామశాస్త్రి
శంకర్·గణేష్ · బాలకృష్ణ
S. DAVAD

JAGATI Rs. 2-00 November 1988

34th Year of Publication

# జగతి

ఎడిటర్: చందూర్

నవంబరు - 1988



'గుడ్ మార్నింగ్'

—'సోవియట్ భూమి' సౌజన్యంతో

జగతి - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాస - 600004
ఫోన్ : 76697 — సం॥ చందా రు. 24-00. 2 సం॥లకు రు. 45-00. 5 సం॥లకు
రు. 100-00. జీవిత చందా రు. 300-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం : కూచిపూడి నర్తకి ప్రభా రమేష్

# నిమ్మతొనలు

ఒక్కసారి ఈ షాపులోనికి వెళ్లావంటే, మళ్లీ ఈ షాపుకే తప్పకుండా వస్తావ్ - అంది మంగతాయారు.

'ఈ షాపులో వస్తువులు అంత చవకా ?' - అని ప్రశ్నించింది ఆండాళ్.

'కాదు'

'ఫారెన్ వస్తువులా?'

'ఊహు'

'అప్పు ఇస్తారా ?'

'ఇవ్వరు'

'గిఫ్టులు ఏమైనా యిస్తారా ?'

'అదీ లేదు.'

'ఏమీ లేనప్పుడు ఈ షాపుకే ఎందుకొస్తామని అంటావ్ ?" - అని నిలదీసింది ఆండాళ్.

'ఇక్కడి వస్తువులు అంత నాసిరకం గనక తిరిగి యిచ్చేయటానికి తప్పక వస్తావ్'

—యమ్‌పి వరప్రసాద్
ఇబ్రహీమ్‌పట్నం

ఏమిటోయ్, రామారావ్, ఆ జనం అలా పరిగెడుతున్నారు ? - సందేహ నివృత్తి కోసం అడిగాడు శంకరం.

'ఏమీలేదయ్యా, అక్కడ ఫైర్ ఇంజన్ తగలడుతోంది - దానిని ఆర్పడానికి పరిగెడుతున్నారు'

—వి సత్తిబాబు
కోరుకొల్లు

నాన్నా, మనింట్లో ఎన్నో చీమలు వున్నా చలి వేస్తుందేమిటి? - అని అడిగాడు కుమారరత్నం.

'చలికీ,చీమలకీ సంబంధమేమిట్రా?'

'చలి - చీమల చేత చిక్కి చావదె సుమతీ - అనికదా చెప్పారు....'

—యమ్వి రాజు
పొన్నమండ

చుట్ట కాల్చుకుంటూ భద్రయ్య తన కొడుకుని చదువు గురించి అడిగాడు :

'ఏరా ఎలా చదువుతున్నావ్ ? బాగా చదువుతున్నావా? ఎన్ని మార్కులొచ్చాయి ఈసారి ?'

'నాలుగో రాంక్, నాన్నా ?'

'వెంకయ్యబాబు కొడుక్కి పధ్నాలుగొస్తే, నీకు నాలుగేనా ?'

—బి జేమదాను
కొండపల్లి

రాంబాబూ, మీ ఆవిడ నిన్ను చావబాదుతూంటే, కళ్లు వొప్పగించి చూస్తున్నావా ? ఏం మొగాడివయ్యా, తిరగబడలేకపోయావ్ ? - అంటూ తన మిత్రునికి ధైర్యం నూరి పోసే ప్రయత్నం చేశాడు గిరిధర్.

"నేను వుట్టినే నిలబడలేదు. గబగబా వీధి తలుపువేసి వచ్చాను - ఎవరూ చూడకుండా !"

—జి రాము
నందిగామ

స్వామిజీ మీరు ఈ చెరువులో నీరు పెట్రోలుగా మారుస్తానన్నారు కదా ! మంచి పని జేసి పుణ్యం కట్టుకోండి - మా ఊరికి పట్టుకున్న దరిద్రం తీరిపోతుంది – అని అర్థించాడు భక్తవరుడైన పార్వతీశం.

'పెట్రోలుగా మార్చమంటావా ?' – అని అడిగారు స్వామిజీ.

'మీ మేలు జన్మజన్మలకీ మరువం - ఆ పని తొందరగా చేయండి' - అన్నాడు పార్వతీశం.

'చేసివుందునుగాని మీ ఊళ్లో ఎవరైనా సిగరెట్టు ముట్టిస్తే ఏంగాను ?'

—కె నాగేశ్వరరావు
నర్సారావుపేట

రాజారావు తమ పెంపుడు కుక్కని వెంటబెట్టుకొని స్నేహితుడు సుధీర్ యింటికి వెళ్లాడు.

'గాడిదను తీసుకొచ్చావేమిటి ?' అని అడిగాడు సుధీర్.

'ఇది గాడిద కాదోయ్ - కుక్క' – అన్నాడు రాజారావు.

'నేను అడిగింది నిన్ను కాదు - కుక్కని !'

—జియస్ శర్మ
అమలాపురం

మీ నాన్నగారి పేరేమిటమ్మా ? - కొత్తగా క్లాసులో చేరిన ప్రమీల నడిగింది టీచరు.

'అని నువ్వు పిలుస్తావు. మీ అమ్మగారు ఏమని పిలుస్తారు ?'

'నేను పిలిచినట్లు పిలవదండి'

'మరి, ఏమని పిలుస్తుంది ?'

'ఏమండీ - మీకే చెబుతున్నది'

—వైవి రమణ
చీరాల

# పాఠకుల తీర్పు

శ్రీ చందూర్ గారికి : సప్రేమ నమస్కారాలు. ఎవరెస్ట్ శిఖరాన్ని చేరగలిగిన ఆ కవి, ఎందుకు ఇంతగా దిగజారి పోయాడన్న ప్రశ్న, కొంత వరకు ప్రశ్నగానే వుండిపోతుంది.... 'నొటోరియస్' గానైనా సరే తనని పదిమందీ చెప్పుకోవాలనుకున్నాడట ఆస్కార్ వైల్డ్.... మీ 'డైరీ' వార్తల డైజస్ట్.

—ఎ సాయిప్రసాద్
మద్రాసు-101

యన్నార్ చందూర్ గారికి: స్వాతంత్ర్య దినోత్సవ సంచిక బాలా పుష్టికరం వుంది. 'స్వాతంత్ర్య పత్రం' గురించిన రచన ఎంతో ఆసక్తిదాయకంగాఉంది.

—వావిలాల గోపాలకృష్ణయ్య
గుంటూరు-2

చందూర్ గారికి : నమస్కారములు. రఘు. తన తండ్రిని అడిగే ప్రశ్నలు, నేటి యువతరమునకు సర్వ సహజముగా కలుగునవి. ఈ ప్రశ్నోత్తర రూపమున రామాయణములోని కొన్ని ఘట్టములను హృదయంగముగ చెబుతున్నారు. స్వధర్మ స్వారాజ్య సంఘము వారికి మా ధన్యవాదములు.

—వి. రామకృష్ణారావు
కాకినాడ-2

శ్రీయుత చందూర్ గార్కి నమస్కారములు. సాధారణంగా అపహరింపబడ్డ వస్తువులు మళ్లీ దొరకడం జరగదు. మీ అదృష్టం వల్లే మీ మంచి తనానికి ప్రతిఫలమా అన్నట్లు అవి తిరిగీ లభించాయని నమ్ముతున్నాను. 'జగతి' లోని 'డైరీ' శీర్షిక చాలా బాగుంటున్నది.

—సిహెచ్ మల్లిబాబు
దుమ్మగూడెం

శ్రీ చందూర్‌గారూ : 'హరిశ్చంద్ర' లో పద్యాలు శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతంగారు వ్రాసినటు చెప్పివుంటే బాగుండేది కదా! జర్నలిస్ట్ వెలుగులు వెదజల్లాలిగాని చీకట్లని చిక్క బడనీయ రాదు. భావితరాలు అయోమయంలో పడకూడదు.

—బియస్ రామారావు
మద్రాసు-24

చందూర్‌గార్కి : వందనాలు. (మా జిల్లా ప్రముఖుల భాష) .... 'వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం .... దొరికితే చదవండి' అని వుంది. 'దొరక్కపోతే మీ ఖర్మ' అని చేరిస్తే ....

— అద్దంకి మన్నార్
న్యూఢిల్లీ - 3



# ప్రాచీన సాహితి

అరయ మత్సరము విడనాడి సముచిత కార్యనిశ్చయో
దార విచారులై సరసతన్ వచియింతురు గాక సజ్జనుల్
ధారుణి సేవ్యముల్ గిరినితంబములో మరికాక మన్మథ
స్మేర విలాసినీ జన విశేష నితంబముతో తలంపగన్

— భర్తృహరి



గౌతమీస్నానాన గడ తేరు దామంటె
మొనసి చన్నీళ్లలో మునుగ లేను
దీర్ఘయాత్రలచే గృతార్థు లౌదామంటె
బడలి నేమంబు లె నడపలేను
దానధర్మముల సద్గతిని జెందుదమంటె
ఘనముగా నా వద్ద ధనము లేదు
తప మాచరించి సార్థకము నొందుదమంటె
నిమిషమైన మనస్సు నిలుప లేను
గష్టముల కోర్వ నాచేత గాదు నిన్ను
స్మరణ చేసెద నా యథాశక్తి కొలది
భూషణవికాస శ్రీధర్మపుర నివాస
దుష్టసంహార నరసింహ దురితదూర

— నరసింహ శతకం



శారద నీరదేందు ఘనసార పటీర మరాళ మల్లికా
హార తుషార ఫేన రజతాచల కాశ ఫణీశ కుంద మం
దార సుధా పయోధి సిత తామర సామర వాహినీ శుభా
కారత నొప్పు నిన్ను మది గానగ నెన్నడు గల్గు భారతీ

—పోతన 'భాగవతం'

# పాతికేళ్లనాటి పిక్చర్

## భరణీ వారి 'వివాహ బంధం'

మనవాళ్లు యింతవరకూ మట్టిబొమ్మలనీ, ఆట బొమ్మలనీ, రంగు బొమ్మలనీ, మాత్రమే చూబుతూ వచ్చారు. కాని ఈ చిత్రంలో మీకు రక్త మాంసాలూ విద్యా వివేకాలూ గల ఒక వనిత కనిపిస్తుంది. ఆమెకి ఒక మనసు, కొన్ని అభిరుచులు అభిప్రాయాలూ, కొంత వ్యక్తిత్వమూ వుంటాయి. భర్తని నీడ వలె అనుసరించడానికి సంసిద్ధురాలై వున్నప్పటికీ, అతను తన ఆత్మాభిమానాన్ని ఆదరించ లేకపోతే, మనసుకి తగిలే గాయంతో కుమిలిపోతుంది. ఈ నవభారతవారి తన హక్కుల ప్రస్తావన తీసుకురాదు. మనో నాధుడే తన మనసు గ్రహింప నేరకపోతే, తన కర్తవ్యమేమిటి, తన దిక్కేమిటి, అని ఎవరికీ చెప్పుకోలేని మూగవేదనతో విలపిస్తుంది. కట్టెలు నరికే వానికి పూల మొక్కని పెంచడం ఎలా చేత నవుతుంది ? – అని చంద్రశేఖరం పినతల్లిచేత అనిపించడం ఎంతో బావుంది .... తలిదండ్రులూ, అన్నదమ్ములూ, అక్క చెల్లెళ్లూ లేక, పినతల్లి పెంపకంలో, తన చదువే ప్రపంచంగా పెరిగిన చంద్రశేఖరానికి (యన్ టి రామారావు), స్వంతకారు చెడిపోవడం వల్ల కాలేజీనుంచి బస్సులో రావలసివచ్చిన భారతి (భానుమతి) తటస్థపడుతుంది. చూపులతో ప్రారంభమైన పరిచయం, మాటల నుంచి, మమతల నుంచి, మాంగళ్య ధారణ దాకా వెళ్తుంది. దాంపత్య సీమలో అడుగిడగానే, స్వభావ వైరుధ్యానికి సంబంధించిన సమస్యలు అంకురిస్తాయి. .... భారతి నవయువతి. ఆలుమగలనగా అనుగార వల్లరిచే కట్టివేయబడ్డ అదృశ్య బంధమని ఆమెకు అంతర్యంలో తెలుసు. కోపాలు వచ్చినంతమాత్రాన, తెగతెంపులు చేసుకు విడిపోలేరు .... ఈ చిత్రంలోనివన్నీ ఉదాత్త పాత్రలు - వెకిలి మాటలూ వెకిలి చేష్టలూ ఎక్కడా లేవు. ఆఖరికి బోళాబోళీ అత్తగారు కూడా అల్లుని మేలుకోరే చెబుతాన్నాననుకుంటుంది. రామారావు, భానుమతి తమ పాత్రలని ఎంతో రసవత్తరంగా పోషించారు. 'నగుమోము గనలేని' కృతి చెవుల మీద అలా నిలిచిపోతుంది. సంభాషణలు సూటిగాను, సమయస్ఫూర్తితోను వున్నాయి. సామాజికులు మెచ్చుకొనే ఇంత చక్కని చిత్రం నిర్మించిన దర్శకులు రామకృష్ణ అభినందనీయులు.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - నవంబరు, 1963

# పన్నెల కెరటాలు

## స్త్రీ పాత్రలు

సినిమాల్లో స్త్రీ పాత్రల పరిసితి ఎలా దిగజారిందో అందరికీ తెలిసిందే. కొన్ని సినిమాల్లో నాయికలు నాయకుడి కాళ్ళ చుట్టూ పెంపుడు కుక్కల్లా తిరిగితే మరి కొన్నింటిలో త్యాగం, ఉదాత్తత పేరు తో ఆత్మవంచన చేసుకుంటారు. ఎంతో పేరు పొంది అవార్డులు గడించిన దర్శకులు కూడా ఆడవాళ్ళని తమ సినిమాల్లో గడప దాటనివ్వరు. కొండో కచో దాటినా సర్వనాశనంతప్ప మరేం మిగలదన్నట్లు చూపిస్తారు. ఈ పాత్రల మాటలు, చేతలు. దుస్తుల దగ్గర్నించీ అసంబద్ధంగా ఉండటమే కాక,అలాంటి వాటినే ప్రేక్షకులు ఇష్ట పడతారని దర్శకులు ధైర్యంగా ప్రకటనలిస్తారు. సినిమాల్లో వీరి పరిసితి ఇలా ఉండటా న్ని ఇష్టపడే ఈ పురుష పుంగవులు (నాయకులు, దర్శకులు) తమ భార్య ల్ని సినిమాల్లోకి అడుగు పెట్టనివ్వరు. అరుదుగా అలాంటివి జరిగితే గొడవ లు తప్పవు వారి సంసారాల్లో.... సిని మాల్లో మహిళల సంగతి అలా ఉంచితే వార్తా పత్రికలు, వ్యాపార ప్రకటనలు వీటికేం తీసిపోవు. ఏదో ఒక రకంగా వార్తా పత్రికలు స్త్రీలను అనాదరణకు గురి చేస్తూనే ఉన్నాయి.

—ఉష

## 'సర్కార్ ఎక్స్‌ప్రెస్' లో ఖాదీ భాండార్

నేను మదనపల్లెలో 1935వ సంవత్సరంలో ఖాదీభండార్ సర్టిఫైడ్ బై ఆంధ్రా స్పిన్నర్స్ అసోసియేషన్‌బ్రాంచ్ స్థాపించాను. శ్రీమతి మార్గరెట్ దేశ స్వాతంత్ర్యములో పాల్గొని జైలు శిక్ష ననుభవించి విడుదలయినారు. ఆమె ఐరిష్ లేడీ. వారిచేత నా ఖాదీభాండార్ తెరువబడింది. మా తాలూకాలో ఖాదీ ప్రచారము విరివిగా జరుపబడినది. ప్రతి వారూ ఖాదీకట్టుట మొదలు పెట్టినారు. విద్యార్థులు ముఖ్యముగా ఖాదీ ప్రచార మునకు కంకణము కట్టుకొని పండుగలు వచ్చినపుడు వారుకూడా ఇంటింటికీ వచ్చి విరివిగా విక్రయించినారు. ఖాదీ కట్టునట్టు చేసినారు. రాజగోపాలాచారి గారు, బాబూ రాజేంద్ర ప్రసాద్‌గారు (అపుడు ఆల్ ఇండియా కాంగ్రెస్ ప్రెసి డెంట్‌గా) ఇచ్చటికి ఏతెంచినారు. మా భాండార్‌కు వచ్చినారు. మా విజిటర్స్ బుక్‌లో వారి అభిప్రాయములు వ్రాసి నారు. శ్రీ పట్టాభి సీతారామయ్య గారు

బెజవాడ గోపాలరెడ్డి గారు, ఆచార్య రంగాగారు, భారతీదేవి రంగాగారు, కల్లూరు సుబ్బారావు గారు, సోషలిస్టు పార్టీ నాయకులైన పట్వర్ధన్‌గారు, రణదివే, బుఖారి కమలాదేవి చటోపాధ్యాయగారు మా భండార్‌కు విచ్చేసి మా విజిటర్స్ బుక్‌లో వ్రాసినారు. కీర్తిశేషులైన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు గారు కూడా వారి అభిప్రాయాన్ని వ్రాశారు. ఆ కాలంలో అది దేవాలయంతో సమానము. నేను ఆ కాలములో ఖాదీ భండార్ నడుపుతూ సెక్రటరీగా పనిచేశాను.

—నూతి రాధాకృష్ణయ్య
'గాంధీక్షేత్రం' లో

## జి యన్ రెడ్డి

తెలుగు సాహిత్యంపై ఆంగ్ల సాహిత్య ప్రభావం అనే అంశంపై ఆంగ్లంలో సమర్పించిన పరిశోధక గ్రంథం, మహా విద్వత్ ప్రముఖుల ప్రశంసలకు పాత్రమైంది. అట్లే పి. హెచ్ డి. పట్టం కోసం ఆంగ్లభాషలో రచించి మద్రాసు విశ్వ విద్యాలయానికి సమర్పించిన

(A Study of Telugu Semantics) అనే పరిశోధక గ్రంథం తెలుగులో శాస్త్రీయమైన పద్ధతులలో, తొలిసారిగా సమర్పింపబడిన పరమ ప్రామాణిక గ్రంథంగా నేటికీ పరిగణింపబడుతూంది. అమెరికాలోని విస్కాన్సిన్ యూనివర్శిటీలో విజిటింగ్ లెక్చరర్‌గా రెండేళ్లు వుండడమేకాక, డాన్‌మాట్‌సన్‌తో కలిసి తెలుగు అభ్యసించే అమెరికా విద్యార్థులకు ఉపయుక్తంగా రెండు పాఠ్య గ్రంథాలను రచించి యిచ్చారు. ఈ నాటికీ కొన్ని కళాశాలల్లో తెలుగు నేర్చుకునే అమెరికన్లకు ఆ గ్రంథాలు ఉపాధేయాలుగా వున్నాయి..... అయిదేళ్లపాటు బ్రౌన్ ప్రాజెక్టును నిర్వహించి తెలుగు భాషా సాహిత్యాలకు సి. పి. బ్రౌన్ చేసిన అపూర్వ సేవలకు గుర్తింపుగా కొన్ని బ్రౌన్ గ్రంథాలను తన సంపాదకత్వాన వెలువరించారు..... విద్యారంగంలో ఆయన సృష్టించిన మానవీయమైన విలువలు అందరికీ ఆదర్శాలు. విశ్వ విద్యాలయాలలో తెలుగు బోధనను, పరిశోధనను ప్రభావితం చేసి శాస్త్రీయ ప్రాతిపదిక మీద ఆధునీకరించిన విద్యావేత్త డాక్టర్ జి. యన్. రెడ్డి.

—ఎ వెంకురెడ్డి
'జమీన్ రైతు'లో

---

మూర్ఖులకి వివేకం బోధించడం వృథాశ్రమ - బొగ్గుని ఎంత కడిగినా తెల్లబడదు. —కబీరు

నింద వేయడం అబద్ధం చెప్పడం కంటె ఘోరం - అది అబద్ధాన్ని దాచే బురఖా. —పోప్

గొప్పదన మెప్పుడూ నిరాడంబరతని పోలివుంటుంది-ఈ రెండిటి మధ్యా గల దూరం అతిస్వల్పం. —ఎమర్సన్

మహనీయుల ఘనతపై విశ్వాసం వుండక పోవడంలోనే సామాన్యుల స్వల్పబుద్ధి వెల్లడవుతుంది.

—కార్లయిల్

## మానవ ప్రగతి

## దోసకాయ

దోసకాయలంటే ప్రపంచంలో నోరూరం దెవరికి? "తరుణ కుస్తుంబరీ దళమైత్రితో నాల్కతుప్పుడుల్చెడు నక్క దోస బజ్జి", అని తుమ్మల సీతా రామమూర్తి దోసకాయలకు సర్టిఫికెట్ కూడా ఇచ్చాడు. ఇటు ఆరోగ్యరీత్యా, అటు రుచిరీత్యా, దోసకాయలు కూర గాయల్లో తమదైన స్థానాన్ని ఏర్పరచు కున్నాయి. అజీర్తి చేసినపుడు 'దోస కాయలు తిన్న కడుపు దొంగలుపడ్డ ఇల్లు' అన్న సామెతని మన పాత కాలపు బామ్మలు విసురుతూ వుంటారు. పేదోళ్లకి, పెద్దాళ్లకి సమానంగా కంచాల్లో ఘుమ ఘుమ లాడించే దోసకాయల్లోనే, దోసకాయలు కాని దోసకాయలు ఓతెగ వుంది. అవే సముద్రపుదోస కాయలు. సముద్రం అనాదిగా మానవుడికి అభరణాల పెట్టిగా మాత్రమే కాదు. ఆహారాల 'ఫ్రిజ్జి' కూడా. ఇంకా ఆ 'ఫ్రిజ్జి' తలుపులు పూర్తిగా తెరిచి వెతుక్కోవాలే కాని దొరకనిది లేదంటారు శాస్త్రవేత్తలు. నిజానికి ఈ సముద్రపు దోసకాయలు కూరగాయలు కాదు. ఇవి సెంట్ పెర్ సెంట్ మాంసాహారం. అంటే ఇవి ముమ్మూర్తులా దోస కాయల్లా ఉండే సముద్ర ప్రాణులు. కాకపోతే మామూలు దోసకాయల్లో పసుపు పచ్చగానో ఆకుపచ్చగానో కాక బూడిదరంగులో ఉండి దాని మీద తెల్లచుక్కల్లో నోరూరిస్తూ తిరుగుతుంటాయి. ఇవి ఈశాన్య ఆసియా, చైనా ప్రాంతంలో ధన వంతులు మాత్రమే తినే విలాసవంత మైన ఆహారం. కిలో సముద్రపు దోసలు దాదాపు రెండొందల యనభై రూపాయల బెట్టి కొనుక్కొని అపురూపంగా ఆరంగిం చే స్తుం టా రు అదృష్టవంతులు. దీని మూలాన భారత ప్రభుత్వానికి దాదాపు ఇరవై లక్షల రూపాయల పైచిలుకు విదేశీ మారకద్రవ్యం లభిస్తుంది కూడా. అందుకే 1982లో తీరప్రాంతాల్లో వీటిని గాలాలతోటి వలలతోటి పట్టడం నిషేధించారు కూడా. అంటే 3 సెం. మీ పొడవులోవున్న "పిల్ల కాయల్ని" పట్టడం చట్టరీత్యానేరం. అంతేకాదు చిన్న వాటిని ఎగుమతి

చెయ్యడమూ నేరమే ఈ సముద్రదోస కాయప్రాణులు మన్నారు సింధు శాఖ లోను, పాక్ అఖాతంలోను, లక్ష ద్వీపా ల్లోను అండమాన్ నికోబార్ ద్వీపాల లోను తట్టలు తట్టలు దొరుకుతాయి. కేంద్ర జలాంతర మత్స్యపరిశోధనా సంస్థ ( సి. యం. యఫ్. ఆర్. ఐ.) వీటి విషయం తీవ్ర పరిశోధన జరిపి వీటిని సాధారణ వాతావరణ రూపంలో టాంకుల్లో పెంచే కృత్రిమ పద్ధతిని కనిపెట్టింది. ఈ పరిశోధనా సంస్థ తమిళనాడులోని టుటీకోరన్‌లో ఉంది. ఈ సంస్థ క్రత్రిమంగా వీటిని పొదిగి దోసపిల్ల కాయల్ని తయారు చేసి విదేశాలకు ఎగుమతిచేసి, రుచు లూరే ఈ పులుసులు తయారుచేసే కర్మాగారాలకు నోరూరే వాటిని అందిస్తుంది.

## క్షుద్బాధ

తిండి లేకపోతే మనిషి చేయగలి గింది ఏమీ వుండదు. మానవుడు ఎన్ని ఘనవిజయాలు సాధించినా తిండి తిన కుండా వుండగలడా ? తిండి తింటేనే కదా శక్తి వుండేది. తిండికి యింత ప్రాధాన్యం వుండబట్టే కామోసు దాని మీద ఎన్నో సామెతలు కూడా వాడుక లోకి వచ్చాయి. 'కోటి విద్యలూ కూటి కొరకే' 'ఏపాటు తప్పినా సాపాటు తప్పదు' 'ఉదర పోషణార్థం' వంటి సామెతల్ని మనం తరచు వింటుంటాం. మానవుడు ఎన్నో అద్భుతమైన విజయా లు సాధించాడు. చంద్రమండలంమీద అడుగుపెట్టాడు. రోదసిలో నెలల తరబడి విహరిస్తున్నాడు. ఇతర గ్రహాలకు రోదసి నౌకల్ని పంపుతున్నాడు. కానీ యింతవరకూ ఆకలి బాధను నిర్మూలిం లేకపోతున్నాడు. ఈనాటి యీ ఆధునిక ప్రపంచంలో, 21వ శతాబ్దంలో అడుగు పెడుతున్న యీ తరుణంలో ప్రపంచం లో కోట్లాది మంది ఆకలితో అలమ టిస్తున్నారు. ఆ ఆకలి బాధకు తట్టుకో లేక ప్రాణాలు విడుస్తున్నారు. నిపుణు ల అంచనా ప్రకారం ప్రపంచంలో ప్రతి ఐదవ వ్యక్తి క్షుద్బాధకు గురవు తున్నాడు. ప్రతి ఏటా 13 నుంచి 18 మిలియన్‌ల మంది తినడానికి తిండిలేక చనిపోతున్నారు. అంటే నిముషానికి 24 మంది యీ ఆకలి పొట్టన పెట్టుకుంటు న్నదన్నమాట. ఇంతకన్నా దారుణమైన విషయమేమంటే 24 మందిలో 18 మంది అన్నెం పున్నెం ఎరుగని పసి పిల్లలు వుంటున్నారు. హిరోషిమా మీద వేసిన బాంబుకు ఎంత మంది ప్రజలు చనిపోయారో అంతమంది యీ నాడు ఆకలి బాధతో ప్రతి మూడు రోజుల కొకసారి మన ప్రపంచంలో చనిపోతున్నారని నిపుణులు అంచనా వేశారు. ప్రతి ఏటా 15 మిలియన్‌ల మంది పసిపిల్లలు తొలిసంవత్సరాల్లోనే చనిపోతున్నారు. ఆఫ్రికా, ఆసియా, దక్షిణ అమెరికాలలో క్షుద్బాధ సమస్య చాలా తీవ్రంగా వుంది.

## విజయ్ అమృత్‌రాజ్

ఇండియా దేశానికి చెందిన ప్రఖ్యాత టెన్నిస్ క్రీడాకారుడు విజయ్ అమృత రాజ్‌కు ఇటీవల అమెరికాలోని

లాస్ ఏంజిలిస్‌లో అంతర్జాతీయ శాంతి బహుమతి లభించింది. అక్కడ ఈ ఏడాది 'ఇంటర్నేషనల్ హ్యూమానిటేరియన్ పీస్ అవార్డు' ను అందుకున్న 26 మంది విశిష్ట వ్యక్తులలో విజయ్ ఒకరు. అవార్డును పొందిన ఇతర ప్రముఖులలో జెస్సీ జాక్సన్, విన్నీ మండేలా, బిషప్ డెస్మండ్ టూ టూ, మహమ్మద్ అలీ తదితరులున్నారు. లాస్ ఏంజిలిస్‌లోని 'హ్యూమన్ ట్రీ ఆర్గనైజేషన్' అనే సంస్థ విశిష్ట కృషి జరిపే వ్యక్తులకు ఈ బహుమతిని అందజేస్తుంది. కాగా, ఈ అవార్డు ప్రదానోత్సవ కార్యక్రమం సందర్భంగా సేకరించిన విరాళాలను 'ఎయిడ్స్' వ్యాధితో పుట్టిన పిల్లలు; డ్రగ్స్, ఆల్కహాల్‌లకు అలవాటు పడిన వారికోసం వినియోగిస్తారు. నిర్భాగ్య బాలల సముద్ధరణ కోసం విజయ్ అమృతరాజ్ చేస్తున్న మానవతా కృషిని 'హ్యూమన్ ట్రీ ఆర్గనైజేషన్' ప్రశంసించింది.

## విజయ గాథ

కరీంనగర్ జిల్లాలో కోవెల గంటలు గణగణ మోగే కాళేశ్వరం గ్రామంలో సయ్యద్ ఇక్బాల్ ఓ నిరుపేద. పేదరికం కాటేసిన అతని తల్లి దండ్రులు అతడికి ఐదో తరగతి దాకా చెప్పించారు. ఆపైన ఇక సాధ్యం కాలేదు. రెండు పూటల కంచాలు లేచేంత లాభంతో సాగే ఓ కిరాణా దుకాణంతో గడుపుతోంది ఆ కుటుంబం. కాలచక్రం తిరిగింది. పెద్దవాడయ్యాడు ఇక్బాల్. ఆ పేదరికంలోనే పెళ్ళికూడా అయింది.

## నెహ్రూ వాణి

మనిషి ఒక పువ్వులా ఒక మొక్కలా పెరగవలసిన వాడు. పెరిగేందుకు మట్టీ నీరూ కావాలి. ఎండ పొడ, ఆరు బయలూ కావాలి. ఆ మొక్క దానంతటది పెరుగుతుంది గాని మనం శాసించి పెంచగలమా?

1952 నవంబరు 17

చిరుదుకాణం గడపలో కూర్చుంటే కుటుంబం ఒక పీడకలలా తోచేది. ఓ ఆలోచన అతని మెదడులో వచ్చింది. సైకిల్ షాప్ నడిపితే ఎలా ఉంటుందని. ఐదువేళ్ళు నోట్లోకి వెళ్ళడం కష్టమయ్యే అతనికి ఐదువేలు ఎక్కడనుంచి వస్తాయి? తోటి గ్రామస్థులు అనుకుంటే విన్నాడు ఇగ్బాల్ "సమీకృత గ్రామీణాభివృద్ధి పథకం (ఐ ఆర్. డి. పి.) క్రింద మహాదేవపురం మండలంలోని యూనియన్ బాంక్ అప్పులిస్తుందని." వెంటనే మేనేజర్‌ని కలుసుకున్నాడు ఇగ్బాల్. అతని గాథని విని, అతని ఉత్సాహాన్ని చూసి మేనేజరు జూన్ 10, 1986న నాలుగు వేల రూపాయల అప్పు మంజూరు చేశారు. అంతేకాదు అందులో రూ. 1330లు సబ్సిడీ కూడా. ఆరు సైకిళ్ళతో దుకాణం పెట్టాడు. కాలచక్రం వేగంతో సైకిల్ చక్రం తిరిగింది. నెలకు వెయ్యి రూపాయలు పైగా ఆదాయం అతని ముంగిట్లో వాలుతోంది. అప్పు తీర్చడం మొదలుపెట్టాడు. ఇంకొక 1800/- తీరిస్తే ఆ షాప్ సొంతం. ❋







# జెమిని

## పళ్ళపొడి

మీ దంత సౌభాగ్యానికి పూర్తిరక్షణ

స్పిరమెంట్,పిప్పరమెంట్,లవంగనూనెల సమ్మేళనం

## జెమిని కెమికల్ ప్రొడక్ట్స్

P.B.No.7 మచిలీపట్నం-521001.

# కొత్త పుస్తకాలు

విజ్ఞాన సర్వస్వము – తెలుగు సంస్కృతి. రెండవ సంపుటం ప్రచురణ : విజ్ఞాన సర్వస్వ కేంద్రం, తెలుగు విశ్వవిద్యాలయం, కళాభవన్, హైదరాబాదు - 500004, వెల : రు 100-00

బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షులుగా, మోటూరి సత్యనారాయణ గౌరవ కార్యదర్శిగా 1947లో తెలుగు భాషాసమితి మద్రాసు యూనివర్సిటీ కాంపస్‌లో జన్మించింది; అప్పట్లో పదహారు సంపుటాలుగా విజ్ఞాన సర్వస్వం వెలువరించా లనుకున్నారు. ఆయా సంపుటాలు బయటికి రాగానే పాఠకులు ఎంతో ఆసక్తి కనబరిచారు. అయితే, ప్రాజెక్ట్ పూర్తయితే గాని పునర్ముద్రణావకాశాలు తక్కువగా వుండేవి. ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డాక మద్రాసు, హైదరాబాదు, వాల్తేరు – మూడు చోట్ల తెలుగు భాషా సమితి కార్యాలయం ఉండేది.

1959, 1961లలో తెలుగు సంస్కృతిని గురించి రెండు సంపుటాలు వెలువడ్డాయి. విస్తరించిన సమాచారంతో అది యిప్పుడు మూడు సంపుటాలుగా వస్తోంది. 1983 మే నెలలో మొదటి సంపుటం వెలువడింది. 1987లో తెలుగు భాషా సమితి తెలుగు విశ్వవిద్యాలయంలో కలిసిపోయి, అనుబంధ శాఖగా మారాక, ఏటా 25 లక్షల బడ్జెట్‌తో 36 సంపుటాలుగా విజ్ఞాన సర్వస్వం తెలుగులో పబ్లిష్ చేయాలని సంకల్పించారు. మొత్తం కార్యక్రమం ఏడునుంచి పది సంవత్సరాల వ్యవధిలో పూర్తి అవుతుందని అంచనా.

254 మంది రచయితలు 1190 అంశములు సేకరించారు; 450 చిత్రాలు వున్నాయి. బి రామరాజు, పివి పరబ్రహ్మశాస్త్రి, సంపాదకులుగా సి శేషగిరిరావు సంగ్రాహకునిగా, వై ఆంజనేయులు నిర్వాహక సంగ్రాహకునిగా, అకారాద్యను క్రమణికలో తెలుగు సంస్కృతీ వికాసాన్ని తెలిపే రిఫరెన్స్ బుక్ యిది. విద్యాలయాలూ గ్రంథాలయాలే గాక, సంపన్నులైన ప్రతి ఒక్కరూ తమ యింట్లో అట్టే పెట్టుకోవలసిన ఉద్గ్రంథం. మన మేమిటి, మన సంస్కృతిని పెంచి పోషించిన వారెవరు, ఆ మహానుభావులు ఏ ఏ రంగాలలో ఏవిధంగా కృషి చేశారు – యిటువంటి అమూల్య సమాచారం తెలిపే ఈ రిఫరెన్స్

గ్రంధం మీా పుస్తకాల బీరువాకి నిండు తన మిస్తుంది.

—క్షీరసాగరమ్

* * *

'సింగరేణి మండుతోంది' నవల. రచన: జాతశ్రీ. ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్, విజ్ఞాన భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500 001. వెల: రు 15-00.

1889లో ఇల్లందు (సింగరేణి) ప్రాంతంలో, భద్రాచలం బళ్లమీాద వెళ్లే యాత్రికులు మజిలీచేసి, పొయ్యి రాళ్లు రగుల్కొని మండటం చూసి, అది దేవుని మహత్యం అనుకొన్నారు. పరిసరాలలో వున్న తెల్లదొరలు బొగ్గు గనుల వునికి గ్రహించి, విలువ అంచనా వేసి, నైజాంనవాబువద్ద నుంచి 'దక్కన్ కంపెనీ' అనే పేరుతో ఆ పరిసర ప్రాంతాలన్నీ దీర్ఘకాలపు కౌలుకి తీసుకున్నారు. 2000 మిలియన్ టన్నుల శ్రేష్టమైన బొగ్గు నిక్షేపం యిక్కడ ఉంది.

సింగరేణి బొగ్గు గనులకి, వచ్చే సంవత్సరంతో వందేళ్లు నిండుతాయి. ఆ ప్రాంతాల ఉపాధ్యాయునిగా వున్న 'జాతశ్రీ', 1974 నుంచీ యిటువంటి నవల ఒకటి రాదామనే ఉద్దేశ్యంతో సమాచారం సేకరిస్తూ వచ్చారు. నోట్స్ ఎక్కువై, రచన పూర్తయాక తన మనసులోని బొమ్మ, తను అనుకున్న తీరున కాగితం మీాదకి వచ్చిందా లేదా అనే సందేహ కలిగిందా యనకు.

ఆ చిత్ర కల్పనలో కళాత్మకత ఎంత మేర వున్నదనే విషయం వొదిలేసినప్పటికీ, పాఠకుని మాత్రం బొగ్గుగని కార్మికుల జీవన ప్రాంగణంలోకి తీసుకువెళ్తారు రచయిత. బదిలీ కోల్ ఫిల్లర్, తొంటిర సామి, ఛార్జి షీట్ చిర్నవ్వుతో అందుకొనే రాజన్న, 'కోలో - కోలోయన్న - కోలో .... బదిలీ మజ్దూరు బతుకు వద్దురో' అనే కాజుయల్ లేబర్, భూమి తల్లి 'నీలి పంట' తవ్వి తలకెత్తుకొనే భూమి పుత్రులు, ట్రామరు మజ్దూర్ల పాట వినే టింబరింగ్ మజ్దూరులు, గోఫ్‌శబ్దానికి గాలిశబ్దానికి తేడా తెలియక ఓవర్ మెన్ చేత చివాట్లు తిన్న మొకద్దం సింగరేణి సిరి బాబులు, బల్ల బల్లకూ ఒక కథగల ఆ దొరల క్లబ్బూ, జండా మధ్యలో చక్రమేమిటో రాట్నమెందుకో తెలియని ప్రజా నాయకుడు శ్రీమన్‌రావు, పోరాడితే పోయేవి, సంకెళ్లే కదా అని ధైర్యం చెప్పే ప్రపంచ కార్మిక కంఠం - వీటి మధ్య ఎనభై వేల కార్మిక జీవితంలోని కన్నీటి జల్లు చెబుతుంది ఈ రచన. బొగ్గుగని కార్మికుల పట్ల సానుభూతితో వర్గపోరాట దృష్ట్యా సింగరేణి మండుతోందన్నారు – నిజమే! కాని కార్మిక శక్తికి ప్రతీకగా రాజన్నవంటి సామాన్యుడు చాలడు. అంతకంటె బలవంతుడు, బుద్ధిశాలి, దొరలను వారి మాట ఓడించగలవాడూ కావాలి. ఏమైనా, 'జాతశ్రీ' చక్కటి ప్రయత్నం చేశారు. సింగరేణి అంటే ఏమిటో

తెలుగు వారికి కళ్లకు కట్టినట్లు చెప్పారు.

—క్షీరసాగరమ్

## ఈ మధ్య అందినవి :

అచార్య రంగా 88వ జన్మదిన ప్రత్యేక సంచిక. కిసాన్ పబ్లికేషన్స్, గుంటూరు - 7 .... రు. 25-00.

హరిజన నాయకుడు. రచన: అచార్య రంగా. కిసాన్ పబ్లికేషన్స్, గుంటూరు - 7 .... రు. 10-00.

జాతీయ సమైక్యత – యువతరం పాత్ర. గ్రామీణ యువజన వికాస సమితి, గాంధీక్షేత్రం, అవనిగడ్డ - 521123 .... రు. 5 - 00.

స్వాతంత్ర్య సామిధేని, కోటగిరి వేంకట కృష్ణారావు. గాంధేయ సమాజ సేవా సంస్థ, అవనిగడ్డ - 521 123, రు. 6-00.

The Glories of Kaavete (Kaaveri) Sri Ranganatha Swamy, NS Krishna Murthy and KS Ramanujacharyulu. Sree Veera Brahmendra Mission, Anandasram PO - Via Mydukuru, Cuddapah Dt .. Rs. 10-00.

శ్రీ బ్రహ్మముగారి చరిత్రము. కట్టా నరసింహులు. వీరబ్రహ్మేంద్ర మిషన్, అనందాశ్రమం పోస్ట్ - కడప జిల్లా .... రు. 3-00.

వ్యాస నవమి. డా॥ ఎన్. గోపి. చైతన్య పబ్లికేషన్స్, హైదరాబాద్ .... రు. 20-00.

గాంధీ దర్శనం - వ్యాససంపుటి, మండలి వెంకటకృష్ణారావు. గాంధేయ సమాజ సేవాసంస్థ, అవనిగడ్డ – 521 122 .... రు. 5-00.

జయదేవుని గీత గోవిందము. వైద్యుల కృష్ణారావు, (డి ఎ కాలేజీ - నూజివీడు - 521 201) .... రు. 60-00.

త్యాగరాజు కవిత్వము. ఎస్ శమంతక మణి (మద్రాసు యూనివర్సిటీ, మెరీనా కాంపస్, మద్రాసు - 5 ).... రు. 45-00.

ఉప్పెన నాటి ఉదంతాలు బివి అర్ ప్రసాదరావు, దివిసీమ సాహితీ సమితి, అవనిగడ - 521 123, రు 3-00.

World Thinkers on Ramakrishna - Vivekananda, Swami Lokeswarananda, The Ramakrishna Mission, Institute of Cultures, Gol Park, Calcutta - 700 029 .. Rs. 6-00.

అధర మందారం - కవిత. విజయ సారధి. శ్రావ్య పబ్లికేషన్స్, హైదరాబాదు - 4 .... రు. 2-00.

భవబంధాలు. ఇక్బాల్ అహ్మద్, తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, హైదరాబాదు - 2 .... రు. 2-00.



చరిత్ర పత్రాలలోని పన్నెండుగురు గొప్పవాళ్లలో పదకొండుగురు ఏదో ఒక మహదాశయపు ప్రతినిధులు

—నిషి

# డైరీ

## 1988 ఆగస్టు 03

జులై 25 రాత్రి బయలుదేరి, శివ స్వామి దంపతులతో, వారి అతిధులుగా కొచ్చిన్ వెళ్లాము. కొచ్చిన్‌లో చూసి నవీ, ఆ బోట్ రైడ్, జ్యూయిష్ సినగాగ్ పాల్‌ఘాట్, ఇంద్రప్రస్థ, మలప్పురమ్ డామ్, త్రివేండ్రంలో హొటల్ చైత్ర, కోవలమ్‌లో హొటల్ సముద్ర, నాగర్‌కోయిల్‌లో ఆ లిం డి యా రే డి యో అంజనేయులు, కన్యా కుమారిలో తమిళనాడు గెస్టుహవుస్, కేశవన్ యింట్లో బ్రేక్‌ఫాస్ట్, ఆదర్శ ప్రాయంగా ఉన్న డ్రయివర్ శశి గ్రామమూ, వారి నివాసమూ, ఇంటి తాళాలు పారేసుకు ఆదరా బాదరా స్టేషన్ కొచ్చిన భ్రమరాంబ, ఆమెభర్త, కొచ్చిన్ ఆంధ్రా అసోసియేషన్, రామిరెడ్డి, సుబ్రహ్మణ్యం - ఇలా కేరళలో గడిపిన ఎనిమిది రోజుల కమనీయాను భూతుల గురించి వ్రాసేందుకు ఈ నెలలో వ్యవధి చాలదు గనక పై నెలలో.... తమిళంలో విజయం సాధించిన "పాటి సొల్లయ్ తట్టాదే" చిత్రాన్ని, తెలుగు నిర్మించే సందర్భంగా, నాలుగు ముఖ్యపాత్రలకు ఏ ఏ తారలు అనుకూలంగా వుండేదీ తెలుసుకొనే నిమిత్తం, కొందరు తెలుగు జర్నలిస్టులని రాజేశ్వరీ థియేటర్‌కి ఆహ్వానించారు నిర్మాత శరవణన్.... ఆ గ్రామానికి చెందిన మొదటి గ్రాడ్యుయేట్, రైలులో తటస్థపడ్డ అమ్మాయిని ప్రేమించడం, పారిపోయి వచ్చిన ఆ యిరువురుకీ పోలీసు స్టేషన్‌లో ఇనస్పెక్టర్ గారు స్వయంగా వివాహం జరిపించడం, ఆ యువతీ యువకుల ఉద్యోగం వేట, ఒకే ఆఫీసులో అతను అటెండరూ ఆమె టైపిస్టూ అయే పరిస్థితి ఏర్పడ్డం, ముని మనుమడు కలిగాడనే శుభ వార్తతో అమ్మమ్మ మనసు మారడం, పట్నం వచ్చేసరికి అదంతా ఒక ఫార్సు అవడమూతో అది నుంచీ నవ్వులు కుమ్మరించే ఈ కథ సుఖాంతమవుతుంది. మనోరమది యిందులో ముఖ్య పాత్ర; ఎవియమ్ వారు యిచ్చిన పత్రాలపై ఎవరు ఏ పాత్ర వేస్తే బావుండేదీ వ్రాసియిచ్చాము - ఇది అభిప్రాయ సేకరణ. నిర్ణయం నిర్మాతలది.

## .... 04

యశశ్శరీరులు యార్లగడ్డ రంగనాయకులు చౌదరి పేరిట సోదరుని

కుమారుడు శంభుప్రసాద్ ఒక సాహితీ పురస్కారం ఏర్పరిచారు. ఏటా అయిదువేలు నగదుగా యిచ్చే ఈ అవార్ ప్రథమంగా ఎవరికిచ్చేదీ తర్వాత ప్రకటిస్తామన్నారు. అక్టోబరు రెండవ తేదీన వెంకన్న చౌదరీ మెమోరియల్ అవార్డ్ ఫంక్షన్ జరుగుతుంది. లక్షరూపాయిల బహుమతి మొత్తంలో ఏభైవేలు సైంటిస్ట్ మీనన్‌కి, ఏభైవేలు సుప్రసిద్ధులు వావిలాల గోపాలకృష్ణయ్యకు యిస్తారు. తమ కుటుంబ ఆదాయం నుంచి ఏటా ఒక లక్షరూపాయిలు ఒక ప్రముఖునికి గౌరవపురస్కారంగా సమర్పించాలని సంకల్పించిన మహనీయుడు కీర్తిశేషులు యార్లగడ వెంకన్న చౌదరి. తండ్రి అడుగుజాడలలో నడుస్తున్న శంభు ప్రసాద్ అభినంద నీయులు.... ఇవ్వాళ శంభుప్రసాద్ జన్మదినమవడం వల్ల పత్రికా గోష్టిలో పాల్గొన్న వారూ చూడ వచ్చిన మిత్రులూ ఆయనకు 'మెనీ హాపీ రిటర్న్స్' చెప్పారు.

## . . . . . 05

ఆగస్టు అయిదు గోపాలరెడ్డిగారి పుట్టినరోజు. పూలసజ్జ నిండా గులాబీలతో వెళ్లిన మాలతి, 'పువ్వులు మీకు - సజ్జ కాంతమ్మగారి కీను' అంది. పువ్వులు రేపటికి వాడిపోతాయి - కాని సజ్జ గుర్తుగా ఉంటుంది .... గోపాల రెడ్డిగారి చిరకాల మిత్రులు కీర్తిశేషులు రాజా సర్ ముత్తయ్ చెట్టియారు జన్మదినోత్సవం కూడా యివ్వాళే! చిదంబరంలో అన్నామలై యూనివర్సిటీ స్థాపించిన అన్నామలై చెట్టియార్ కుమారులు ముత్తయ్ చెట్టియార్. తండ్రి వేసిన బాట వెంట నడుస్తున్నారు ముత్తయ్ చెట్టియార్ కుమారుడు డా॥ ఎమ్ ఎ యమ్ రామస్వామి తమిళనాడు గవర్నరు అలెగ్జాండర్ తమ అధ్యక్షోపన్యాసంలో, వెనకటి విద్యా ప్రమాణాలు ఈ రాష్ట్రంలో పడిపోయాయనీ, ఐఎయస్ ఉత్తీర్ణతలో పూర్వపు మాదిరి మొదటి పదిమందిలో ఈ రాష్ట్రవాసులు లేకపోవడం విచారదాయకమనీ, ఎందుకీ విధంగా వెనకబడుతున్నదీ వైస్ ఛాన్సలర్స్ పరిశీలించవలసి వున్నదనీ అన్నారు. సంగీత శాస్త్రంలో పరిశోధన గావించిన వి పి కె సుందరానికి, ముత్తయ్ చెట్టియార్ స్మారక బహుమతి అయిన ఏభైవేల రూపాయిల కాష్‌ప్రయిజ్, అలెగ్జాండర్ అందజేశారు. జస్టిస్ మోహన్, శివజ్ఞాన గ్రామణి, సుందరం గావించిన కృషిని మెచ్చుకున్నారు. రామస్వామి స్వాగతం తెలుపగా, స్టాఫ్ మెంబరొకరు వందన సమర్పణ గావించారు. విద్యాప్రమాణాల గురించి తమిళనాడు గవర్నరు అలెగ్జాండరు చెప్పిన పలుకులు విద్యావేత్తలకు కనువిప్పు కలిగించేవిగా ఉన్నాయి.

## . . . . . 09

పద్మావతీ వారి 'బజారు రౌడీ' లోని పాటల ప్రదర్శన విజయ్‌లో. రాజ్ ; కోటి సంగీతం - వేటూరి సుందరరామ్మూర్తి పాటలు. దర్శకత్వం - కోదండరామిరెడ్డి ; నిర్మాత : సూర్య

నారాయణ బాబు. 'తాక మాక అమ్మమ్మ' (జానకి - బాలు) అని అమ్మాయి అంటే, 'సింగారకొక్క సిగ్గెందుకే' (సుశీల - బాలు) అని కవ్విస్తాడు అబ్బాయి. 'ఓ ప్రేమా' 'ఓం ప్రేమా' అని ఇద్దరూ కలిసి వలపు దేవతని ఆరాధిస్తారు. మొత్తం అయిదు పాటలు. గౌతమి, రమేష్, శోభన ఈ ముగ్గురు చుట్టూ వర్తించే అధునిక ప్రేమాయణ గాథ 'బజారు రౌడీ'. మీరిది చదివేనాటికి పిక్చర్ రిలీజై ఉంటుంది.

. . . . . 10

తారకప్రభు కాంప్లెక్స్‌లో మద్రాసులోని ఫిలిమ్ జర్నలిస్టులు దర్శక నిర్మాత దాసరి నారాయణరావుతో ఇష్టాగోష్టి జరిపారు. అర్జునరావు స్వాగతం తెలిపిన మీదట, స్క్రీన్ శంకర్ దాసరిని పుష్పమాలాంకృతులని చేయగా, కాగడాశర్మ ఆయన విశిష్ట వ్యక్తిత్వం గురించి ప్రసంగించారు. శ్రీనివాస్ చక్కటి తమిళంలో పన్యసించారు. అలాగే, పాండ్యన్ మరి కొందరూ మాట్లాడారు. తమ నూరవ చిత్రం చిరంజీవి హీరోగా, వడ్డే రమేష్ నిర్మాతగా రూపొందనున్నదనీ, అది చిరంజీవి ఇమేజ్‌కి అనుకూలంగా ఉండేదై వుంటుందనీ చెప్పారు దాసరి నారాయణరావు.... మొదటి పిక్చరు 'తాతా - మనమడు' 1973 మార్చి 23వ తేదీన రిలీజయింది. ఈ పదిహేనేళ్లలో ఆయన 97 సినిమాలకు దర్శకత్వం వహించారు.



అందులో రెండు ప్లాటినమ్ జుబిలీ చేసుకున్నాయి; అయిదు గోల్డెన్ జుబిలీ; 26 సిల్వర్ జుబిలీ; 64 శతదినోత్సవం: 21 పిక్చర్లలో యాక్ట్ చేశారు; 51 పిక్చర్లలో పాటలు రాశారు; 85 పిక్చర్లకి కథని సమకూర్చారు. పదిహేను సంవత్సరాల వ్యవధిలో, యింతటి ఘనవిజయం సాధించిన వ్యక్తి ప్రపంచ ఫిలిమ్ చరిత్రలో మరొకరు లేరేమో! అక్కినేని నాగేశ్వరరావు ఎప్పుడూ అయనది 'కంప్యూటర్ బ్రెయిన్' అనే వారు. అది కంప్యూటర్ కాదు -సూపర్ కంప్యూటర్! 41 సం॥ ల దాసరికి ఎంతో భవిష్యత్తు ముందుంది. చిత్ర నిర్మాణ విజయపరంపరగాని, అతి స్వల్పకాలంలో 'ఉదయం' పత్రిక సాధించిన ఘనవిజయంగాని, ఆయన లోని అశాంతిని, ఆరాటాన్ని, ఏదో అందుకోవాలనే తపనని అరికట్టలేవు. ప్రజాహృదయ తంత్రులపై పలికే గాన స్రవంతిని గ్రహించగల అపురూపశిల్పి, అద్భుత కళాకారుడు దాసరి నారాయణరావు.

## . . . . . 11

"డైరీలో రాసుకోండి: ఆగస్టు పదకొండున హౌరామెయిల్‌లో పద్ధెనిమిదీ ఇరవైమంది వెళ్తున్నారు. అందరికి ఎసి స్లీపర్ సందేహం - ఫస్టు క్లాస్ ఖాయం. గ్రూప్ టికెట్ మీ దగ్గిరే ఉంటుంది. 'మనోరమ'లో మీ అందరికీ రూమ్స్ బుక్ అయిపోయాయి. మాలతిగారు ఈసారి తప్పించుకోవడానికి వీల్లేదు" - అన్నారు టివికె శాస్త్రిగారు ఫోనులో - ఏడెనిమిది వారాలక్రితం. ఈసారి మాలతి తప్పించుకోవడానికి వీలవదు. మే నెలలో కాబోలు వచ్చింది, భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్‌వారి స్థానిక (విజయవాడ) ఫెస్టివల్ కమటీ కన్వీనరైన కోనేరు శ్రీకృష్ణ (లక్ష్మయ్యగారి కుమారుడు) వద్దనుంచి లేఖ - కృష్ణాజిల్లాలో జన్మించిన ప్రముఖులలో ఒకరైన మాలతీ చందూర్‌ని, ఈ ఉత్సవాల సందర్భంగా సన్మానింపనున్నామనీ, అంగీకారం వెంటనే తెలుపమనీను! నూజివీడులో జన్మించిన మాలతిని విజయవాడ ప్రముఖులు గౌరవిద్దామనుకున్నప్పుడు కాదనగలమా? యమ్‌వి కృష్ణరావు, బాలమురళి వంటివారి సరసని సత్కారం పొందడం సుకృతం కాదా? అంగీకారం వెంటనే తెలిపాము....
నిన్న వుదయం కోరమండల్‌లో శాస్త్రిగారూ వారి ఫామిలీ వెళ్లారు; ఈ రాత్రి హౌరాలో మేము. గ్రూప్ టికెట్ నాదగ్గిర వుండటం వల్ల ఎవరు వచ్చినదీ, ఎవరు రానిదీ చెక్‌చేసుకు (లిస్టు ఉన్నది), రానివారి టికెట్లకు ముదరా పొందేందుకు, కండక్టరు వద్ద 'ఎన్‌డార్స్‌మెంటు' తీసుకోవాలి. ఆ 'ఎన్‌డార్స్‌మెంటు' వల్ల రెండు మూడు నెలలయాక, చెల్లించిన మొత్తంలో సగమైనా వస్తుంది. వెళ్లేటప్పుడు యిద్దరూ, వచ్చేటప్పుడు యిద్దరూ మాతో జాయిన్ అవలేదు. ఒకొక్కటి రు 191/- నాలుగు టికెట్లు రు. 764 అందులో రు. 380/- వచ్చినా

మంచిదే కద! కమిటీ సౌమ్య వ్యక్తులది కాదు; అంచేత, మరింత జాగర్తగా ఉండాలి. ఆనంద్ కోసం ఆఖరి క్షణం దాకా చూస్తూనే వున్నాం. కాని, ఏదో రికార్డింగ్‌లోనో యిరుక్కుపోయి, ఆయన రాలేకపోయారు. వీణ గాయత్రి, ఫ్లూట్ రమణి, రావి కొండల్రావు మున్నగువారున్నారు మా గ్రూపులో. యస్ జానకి, రామప్రసాద్, ఉమా మురళీకృష్ణ కూడా యిదే ట్రయిన్‌లో ఉన్నారు.... కోనేరు సోదరులు కార్లలో స్టేషన్ కొచ్చారు - అయిదు నిముషాలలో 'మనోరమ' చేరుకున్నాం; 'వెల్‌కమ్' చెబుతూ శాస్త్రిగారు లిస్ట్ ప్రకారం ఆయా రూముల తాళాలు మాకిచ్చారు. మాది 303; గాయత్రీ దంపతులది 305; రావి కొండల్రావుది 401. 'మననీ శాస్త్రి విడదీసేశారు' - అంటూ ఫోర్త్ ఫ్లోర్‌లోకి వెళ్లారు - అంతదాకా కలిసి ప్రయాణం చేసిన రావి కొండల్రావు.

. . . . . 12

స్నానాలై టిఫిన్‌కి ఆర్డరివ్వబోతుండగా ఫోన్ మోగింది - గుంటూరు నుంచి మంగాదేవి. 'మమ్మల్ని ఇప్పుడు రమ్మన్నారా - మీ ప్రోగ్రామేమిటి?' అని అడిగారామె. 'ఇవ్వాళ వొద్దు - ఇంకో గంటా రెండు గంటల్లో నూజివీడు వెళ్తాం - వచ్చేటప్పటికి సాయింత్రమవుతుంది - రేపుపొద్దుట ఫోన్ చేయండి' - అని చెప్పాము. మన సెరిగిన మిత్రులు గనక తప్పుబట్టరు. నేను స్వయంగా చేసేది ఏమీ లేక పోయినా, ఒకసారి గ్రవుండ్స్ వద్దకు వెళ్లాలి - రామ్మూర్తి, ప్రభాకరరావు, యస్వెస్ రాజు, కామేశ్వరశర్మ వంటి మిత్రులని 'పల్కరించి రావాలి' అని మాలతికి చెప్పి వెహికిల్ తీసుకు (మూడురోజులూ మా కోసమని ఒక వాన్ అక్కడ ఉండేది, ఇదిగాక మూడు కార్లు), ఇందిరా గాంధీ మునిసిపల్ స్టేడియమ్‌కి వెళ్లాను. లక్ష్మిగారు (మిసెస్ శాస్త్రి), పిల్లలు (విజ్జి - సాయి) మా రూమ్ కొచ్చి ఏవో కబుర్లు చెబుతున్నారు గనక, నేను రావడం ఆలస్యమైనా మాలతి అంతగా పట్టించుకోదు. అయితే, నూజివీడు ప్రయాణం ఉంది - శాస్త్రిగారు వొప్పుకుంటే, తాము కూడా వస్తామన్నారు.

మిసెస్ శాస్త్రి, పిల్లలూ, స్టే మిత్రులని కలుసుకున్నాను.... 'నిక్షేపంగా వెళ్లిరండి - వైద్యుల నారాయణ దాసుని చూసి రండి' - అన్నారు శాస్త్రిగారు.... రిసెప్షన్‌లో ముందే చెప్పడం వల్ల, నూజివీడు వెళ్లి వచ్చేందుకు అంబాసిడర్ రెడీగా ఉంది. 'ఇలా అయిదు గురం భోజనానికి వస్తున్నట్లు నూజివీడు - 208కి చెప్పండి' అని మూర్తి గారిని ('మనోరమా' మేనేజరు) రిక్వెస్ట్ చేసి, కారెక్కాం; నున్నలో కొబ్బరి బోండాలు తాగి, ఒంటి గంటకు నూజివీడు చేరుకున్నాం. గణపతి దీక్షితులు (మాలతి అన్నగారు — అడ్వకేట్) కోర్టులో అయినా ఉంటాడు; క్లయింట్స్‌తో అయినా ఉంటాడు; ఇంట్లో వుండటం అరుదు.

అనుంగు చెల్లెలు వచ్చిందని కబురు పెట్టగా, కోర్టునుంచి వచ్చాడు. మేము ఒకరోజు వుండాలనీ, వెనకటి సంగతులు చెప్పుకోవాలనీ ఉంటుంది వాళ్లకు. కాని, మావి గంటల విభజనకు లోనైన జీవితాలైపోయాయి. బహుశా, పట్నవాసపు పరుగు అంతేనేమో! వెనకబడకుండా మన శ్రేణి కాపాడుకోవటమే జీవితం. నూజివీడులోని ఆ యిల్లూ, పగడ చెట్టూ, ఆ వాతావరణం మా యిద్దరికీ ఒక జ్ఞాపకాల పుట్ట. వెనకొకసారి 'రాధ - రావిచెట్టు' కథ రాసింది మాలతి. సందు చివర యిప్పుడా రావిచెట్టు వున్నట్టు లేదు. మేము విజయవాడ వస్తున్నామని తెలిసి, మాకోసం ప్రత్యేకంగా వచ్చింది హైదరాబాదు నుంచి మధులత (మా మేనకోడలు) - తను లెక్చరర్: పది హేను రాత్రి బయలుదేరి, పదిహారు కాలేజీ వేళకి అందుకుంటుందట. ఉన్న మూడు గంటలూ యింట్లో వాళ్లని వుక్కిరి బిక్కిరి చేసి, నారాయణ దాసుగారిని చూసి, నాలుగయాక టీ తాగి, బయలుదేరాం. రూమ్‌కొచ్చి, వేన్నీళ్ల స్నానం చేసి, బుద్ధిమంతుల్లా టీవి చూడటం తప్ప, ఎక్కడికీ, కదల్లేదు.

. . . . . 13

పొద్దుట స్టేడియమ్ దగ్గిర కెళ్లేసరికి బాలాజీ విగ్రహానికి అలంకారాలు చేస్తున్నారు; ఒక వంక కుర్చీలు పరుస్తున్నారు; షామియానా కడుతున్నారు; కమిటీ బాడ్జీలు, కారు పాస్‌లూ ఉదయమే తీసుకున్నాను - శాస్త్రిగారి వద్ద నుంచి! ఆ ఎర్రబాడ్జీ వుంటేనే స్థానిక వాలంటీర్లు, పోలీసులు మనని ప్రశ్నించరు; లేకపోతే, మన మెవరమో వారికి తెలియక అడ్డగిస్తారు. బాడ్జీ ధరించేందుకు మాలతి మొదట్లో కొంచెం వెనుకాడింది. కాని, గాయత్రి, లక్ష్మి గారు పెట్టుకోవడంతో తనూ వారి ననుసరించింది.... మూడు న్నరకి స్టేడియమ్ చేరుకొనేసరికి ఎండ మండిపోతోంది. ఆ ఎండ తమ ముఖాల మీద పడకుండా పళనిస్వామి బృందం నాదస్వరం వాయిస్తున్నారు. తెల్లచీరల లేడీ వాలంటీర్లూ, వైట్ పాంటూ వైట్‌షర్టూ మీద గ్రీన్ నెక్ టై వేసుకున్న స్టూడెంట్ వాలంటీర్లూ వందా యాభైదాకా వున్నారేమో! ఇక పోలీసు బలగం చెప్పనక్కర్లేదు. వీరు గాక మంచినీళ్లు అందించే వాలంటీర్లు నలభై ఏభై మంది వుండివుంటారు. మీరు సంజ్ఞ చేయడమేమిటి, మంచి నీళ్లు మీ చేతి దగ్గరకి వచ్చేవి. టాంకర్ చెల్లగా టాంకర్ వచ్చి నిలబడే దక్కడ; ఎప్పుడూ ఒక ఫుల్ టాంకర్ గ్రవుండ్స్‌లో ఉండేది. డ్రమ్ముల్లోకి పరిశుభ్రంగా పట్టిన ఆ నీటిని, జగులోకి తీసుకు, ప్రతి వాలంటీరూ రెండేసి గ్లాసులు చేత బుచ్చుకు, వరస వరసకీ తిరిగేవాడు. జగ్గు ఖాళీ అవగానే నిండా నీరు వున్న మరొక జగ్గు అందించేవాడు యింకో వాలంటీరు. ముఖ్యంగా నీటి సప్లయి విషయంలో కార్యనిర్వాహకులు చూపిన శ్రద్ధ ప్రశంసనీయం..... నిన్న పొద్దుట

కారులో స్టేషన్ నుంచి హొటల్‌కి వస్తున్నప్పుడు డ్రయివర్‌ని అడిగాను. ఇక్కడ వర్షాలేమైనా పడుతున్నాయా? - అని! 'నిన్న రాత్రి కూడా పెద్ద వాన పడింది. ఇవ్వాళ నుంచి పడక పోవచ్చు' - అన్నాడు.
అన్నాను. 'బాలాజీ కల్యాణోత్సవం కదా - తన పెళ్లికి తను ఆటంకం కలిగించుకుంటాడా?' - అన్నాడు. టివికె శాస్త్రిగారు గాని నిన్న మొన్నట్లో ఈ కారులో వెళ్లారా? - అని కించిత్ సందేహం కలిగింది. ఎందుకంటే, యివి ఆయన మాటలు. 'త్రికరణశుద్ధిగా మనం స్వామి కార్యం చేస్తున్నాం - వద్దనుకుంటాడూ, మానేసుకోమనండి' - అని ఆత్మధృతితో పలకగల సాహసం శాస్త్రిగారొక్కరికే ఉంది. ఇప్పటి దాకా జరిగిన పన్నెండింటిలో పది ఫెస్టివల్స్ చూశాను. ప్రతిసారీ శాస్త్రి గారి మనోనిబ్బరం అదే తీరున ఉంటు న్నది. తస్మాత్ జాగ్రత్తలా, తాను నిమిత్త మాత్రుడనని ఎప్పటికప్పుడు చెప్పుకుంటూ వుంటారాయన.... నాద స్వరానంతరం ఛీఫ్ కన్వీనరు టివికె శాస్త్రి, సంగీత నృత్యాల ద్వారా, ఉత్తర దక్షిణాల కలయిక ద్వారా సమైక్యతకు, సమగ్రతకు అంకితమైన ఈ సంస్థ ఆశయాలు వివరిస్తూ, యువ తలో నవ చైతన్య దీప్తి వెలుగొందా

లన్నారు. స్వాతంత్ర్యానంతర భారతావని అంతర్గత విశ్వాసాన్ని కోల్పోయి, గమ్యరహితమైన నడక సాగిస్తున్నదనీ ఆ విశ్వాసం తిరిగి పునరుద్ధరింప బడాలనీ అన్నారు 'బి సి ఐ సి' అధ్యక్షులు మాజీ రాష్ట్రపతి బిడి జెట్టి. విజయవాడ నగర్ మేయర్ జంధ్యాల శంకర్ అధ్యక్షత వహించగా, మద్రాసు తెలుగు అకాడమీ ప్రెసిడెంటైన బాల మురళీకృష్ణ, సంగీతానికి ఎటువంటి ఎల్లలూ లేవనీ, దేశ కాలావధులకు అతీతమైన నాదోపాసన విశ్వమానవ కళ్యాణదాయకం కావాలనీ అన్నారు. జిల్లా కలెక్టరు భట్టాచార్య ఉత్సవ జ్యోతి వెలిగిస్తూ, విజయవాడ కామర్స్ లోనే గాక కల్చర్‌లో కూడా ముందుకి రావాలని అన్నారు. బసవరాజు బ్రదర్స్ వాద్యగోష్ఠి అనంతరం నవనీత హారతితో బాలాజీ విశ్వరూప సందర్శనం. నవనీత హారతి తర్వాత ఆరోజు సన్మానితులను వేదిక మీదకు పిల్చి, ఆయా ప్రముఖులు వారి వారి రంగాలలో గావించిన కృషిని సైటేషన్‌లో చదివారు. సినీ డైరక్టరు విశ్వనాథ్, జగమెరిగిన బాలమురళీకృష్ణ, రచయిత్రి మాలతీచందూర్, గాంధీ క్షేత్రం యమ్ వి కృష్ణారావు సేవా నిరతులు బివియస్సెస్ మణి, వ్యాపారదక్షులు బచ్చు నరసింహారావు - ఈ ఆరుగురినీ బిడి జెట్టి, జంధ్యాల శంకర్, కోనేరు లక్ష్మయ్య సంయుక్తంగా సన్మానించారు. యావదాంధ్రకు తెలిసిన ఆ ఆరుగురి గురించీ వేరే చెప్పవలసిన పని లేదు.

....సన్మానాల అనంతరం సంగీత కార్యక్రమం.... వయసులో చిన్నదైన కుమారి సాయి చక్కగా పాడింది.... స్వాతీ సోమనాథ్ నాట్యప్రదర్శన కాసేపు చూసి, బాలమురళీ దంపతులూ మేమూ ఒకసారి 'మనోరమ' కి వచ్చి, స్నానం చేసి, బట్టలు మార్చుకు, కప్పు కాఫీ తాగి, మళ్లీ స్టేడియమ్ చేరుకున్నాం.... బాలమురళీకృష్ణ శిష్యుడు, టెలికమ్యూనికేషన్స్‌లో ఆఫీసరుఅయిన మురళీకృష్ణ పాట కచ్చేరీ, అచ్చు బాలమురళీ పాడుతున్నట్లే వుంది. శ్రావ్యగానంతో సభికులని ఆనందింప జేశారాయన....బాలాజీ పూలంగి సేవ తర్వాత, యస్ జానకి, బాలకృష్ణ ప్రసాద్‌లు తమ గాన సుధామంజరితో ప్రేక్షకులని పులకింపజేశారు. చిన్ని కృష్ణుని మీద పాట, నాలుగు కంఠాలతో పాడిన పాటతో యస్ జానకి ప్రేక్షకులని విస్మయ పరచగా, బాలకృష్ణ ప్రసాద్ గళంలో అన్నమయ్య కీర్తనలు అమృతధారలయ్యాయి...... శివ రుద్రాభిషేకానంతరం, ఆనంద్ బందోపాధ్యాయ తబలాతో పండిట్ విజి జోగ్, భక్తవత్సలం మృదంగంతో యన్ రమణి. వీరి జుగల్ బందీ వింటూ విజయవాడ పౌరులు తన్మయత్వం చెందారు. ఉత్తర దక్షిణాల కలయిక, హిందూస్థానీ కర్ణాటక సంగీతాల మేళవింపు, రెండు విభిన్న వాద్యాల పరస్పర మైత్రి, రెండు గాన స్రవంతుల సంగమం - సంగీతం సర్వత్రా ఏకోన్ముఖ నాదోపాసన అని ప్రత్యక్షంగా నిరూపించే గాన రసార్ణ

పుటలలవి. ....బాలాజీ హారతితో, గోవిందనామ స్మరణతో, పదకొండు గంటల కనుకున్నది పన్నెండున్నరకి ముగిసింది.... ఈనాటి కార్యక్రమ ప్రయోక్తలు: రావికొండల్రావు, ఆశాలత, మహతి ........ 'ఆరుంపావుకి రెడీగా ఉండండి. - మా రామారావు వస్తారు కారు తీసుకు' - అని చెప్పారు యమ్వి కృష్ణారావ్: రేపు అవనిగడ్డ గాంధీక్షేత్రానికి జెట్టీ వెళ్తున్నారు - వారితోబాటు మేమూను .... అయిదు గంటలకి లేపమని రిసెప్షన్‌లో చెప్పాను.... మధ్యలో మరొక చిన్న విషయం.... మిసెస్ జివిజికృష్ణమూర్తి (పద్మావతి), ఆమె స్నేహితురాలూ వీరాల నుంచి కారులో వచ్చారు; కారులోనే వారి సూట్‌కేసులు వున్నాయి; కారు పాస్ లేని కారణాన ఆ వెహికిల్‌ని లోపలికి రానివ్వ లేదుట. వారిరువురికీ 'మనోరమ' లో బస ఏర్పాటు చేయాలి; 'బిసిఐసి' కోసం రిజర్వ్ చేసిన మరి కొన్ని రూములు వుండకపోవు; మా కారులో వారిని కూచోబెట్టుకు, వారి కారు ఎక్కడ వుందో వెతకగా, కారు కనిపించింది గాని డ్రయివర్ టీకి వెళ్లాడు. అతనొచ్చాక రెండు బళ్లూ 'మనోరమ' చేరుకున్నాయి. మా ఫ్లోర్‌లోనే 306 వారికిచ్చారు; వారి సూట్‌కేసులు రూమ్‌కి చేరుకున్నాక, 'గుడ్‌నైట్' చెప్పుకున్నాం.

..... 14

అయిదుంబావుకి అలారమ్; వెంటనే హాట్ కాఫీతో బేరర్.... స్నానాదులు ముగించుకు ఆరుంబావుకి.

కిందకి దిగేసరికి, మండలి రామారావు అంబాసిడరతో రెడీగా ఉన్నారు. అవనిగడ్డ అక్కడికి 84 కిలోమీటర్లు కాబోలు. రామారావుగారు, నేను, మాలతి వెనక సీట్లో కూచున్నాం - డ్రయివరూ మరొకాయన ముందు సీట్లో! జెట్టీగారు, వారి మనుమరాలు, కృష్ణారావుగారు యింకో కారులో మరొక పావుగంటలో బయలుదేరి వస్తారు.... దివిసీమకు వెళ్తున్నప్పుడు, వెనుకటి ఉప్పెన గురించి మాట్లాడుకోవటం సర్వ సహజం. కాని, వాటికి ముందు కృష్ణారావుగారి కజిన్ రామారావుగారి గురించి రెండు ముక్కలు చెప్పాలి. ఆయన విశుద్ధ కాంగ్రెస్ వాదేగాక, స్పోర్ట్స్ అంటే ఎంతో అభిమానంగల వ్యక్తి. విజయవాడలో క్రికెట్ స్టేడియమ్ కోసం ఆయన జరిపిన, జరుపుతున్న కృషి అనన్య సామాన్యం. గ్రామీణ సహకార సంస్థలతో ఆయనకున్న అనుబంధం, 'గ్రాస్ రూట్స్' నుంచి రావలసిన మార్పుకి మచ్చుతునక. ఢిల్లీ, బొంబయి, మద్రాసు వంటి మహానగరాలలోను, విజయవాడలోను, తమ స్వంత గ్రామంలోను ఒకే తీరున జీవించగల ఈ వ్యక్తి, శ్రీశ్రీ కవితను, శేషేంద్ర కవితను సంభాషణలో గడగడా చెబుతూంటే, మాకు ఆశ్చర్యమేసేది. స్పోర్ట్సూ, సాహిత్యాది లలిత కళలూ, సామాజికాభ్యుదయమూ - ఈ మూడూ ఆలంబనగా జీవిస్తున్న మండలి రామారావు ఒక నిండు కుండ. రానూపోనూ అయిదారు గంటల కారు ప్రయాణంలో ఎన్ని విషయాలు దొర్లాయో, మాకు తెలియనివీ, మా అనుభవంలోకి రాగల అవకాశం లేనివీ ఎన్ని చెప్పారో !....

ఇందిరా గాంధీ దివిసీమకు రెండు తడవలు వచ్చారు. రామకృష్ణా మిషన్, రెడ్‌క్రాస్, రాష్ట్రీయ స్వయం సేవక్ దళం, అన్ని పార్టీలవారు, అన్ని మతాలవారు, జాతీయ అంతర్జాతీయ సేవా సంస్థలవారు, బిల్లీ గ్రాహమ్ మున్నగు ఎందరెందరో, ప్రకృతి బీభత్సానికి గురైన ఈ ప్రజను ఆదుకునేందుకు, ధైర్యం చెప్పేందుకు వచ్చారు. సమస్తం జల ప్రళయమై, బయట ప్రపంచానికి యిది తెలిపే మార్గం లేనప్పుడు, గంటల కొద్దీ కాలి నడకని ముందుకిసాగి, లోకానికి ఈ ఉప్పెన గురించి చెప్పిన ప్రథమవ్యక్తి మండలి వెంకట కృష్ణారావు. ఆ తర్వాతనే హెలికాప్టర్లు 'ఫుడ్‌పాకెట్స్' డ్రాప్ చేశాయి.... "1977 నవంబరు 19వ తేదీ శనివారం, మధ్యాహ్నం ఒంటి గంటయింది. గాలి తూర్పు నుంచి ప్రమాద స్థాయిలో వస్తోంది. తలుపు లాగటం లేదు. లోపల గడియలు పీక్కు పోయాయి. లోన పలుగులు వేసి తొక్కి పట్టుకున్నాము. కప్పిన వెలిశనుంచి కర్రలు జారి పడటం మొదలుపెట్టాయి. గోడ బలంగా రెండు మూడు సార్లు వూగింది. దూలాల క్రిందుగా నెర్రి యిచ్చింది. ఇంటి నడికప్పు ఎగిరిపోయింది.... ఒక్కొక్కరే వెనుక వసారాలోకి జేరుకొన్నాము. తలుపు నాపలేక వది

లేశాము. వాన నీళ్లు యింట్లో చీల మండల లోతు పడ్డాయి. చలితో నిలువెల్ల వణికిపోతున్నాము. కొందరు నిలబడలేక నీళ్లలోనే చతికిల పడ్డారు .... గాలివేగం షుమారు గంటకు 200 కిలోమీటర్లు వుండవచ్చు..... మధ్యాహ్నం రెండు గంటలకు ఆగ్నేయ దిశగా మారి ఉప్పెన తెచ్చిన గాలి, రాత్రి పదకొండు గంటలకు పడమటకు మళ్లింది.... సముద్రపు ఒడ్డునుంచి 15 కిలోమీటర్ల వరకు ఉన్న గ్రామాలన్నీ కొట్టుకు పోయాయి" - అన్నారు డా॥ బి వి ఆర్ ప్రసాదరావు 'ఉప్పెననాటి ఉదంతాలు'లో .... "నేను పిల్లను తీసుకొని ఈదుకుంటూ పోతున్నాను. నా చీర ఒక ముళ్లచెట్టుకు పట్టుకుంది. వాగ ముందుకు నెట్టుతుంది - చీర వెనక్కు లాగుతుంది. నీళ్లలో మునిగి పోయాను. పిల్ల చేయిజారిపోయింది. నేను మునిగి నా చీరకట్టు ముడివిప్పేశాను. చీరంతా వూడిపోయింది. నీళ్లలో పైకి తేలాను. దూరంగా పిల్ల కొట్టుకు పోతోంది.... చేతులు, కాళ్లు తేలి పోతున్నాయి. వాగలు చెంపలు వాయ కొడుతున్నాయి.... నా పిల్లలు వాగుల్లో కొట్టుకుపోయారు. నా భర్త కొట్టుకు పోయాడు. నేను మాత్రం ఎందుకు బ్రతకటం? చచ్చిపోదామనిపించింది. ఇంతలో నాకు దగ్గిరనుంచి ఒక యిల్లు కొట్టుకపోతోంది. దాని మీద మనుషులు కూర్చున్నారు. నన్ను పైకి లాక్కున్నారు. దానిమీద ఇద్దరు మగవాళ్లు, యిద్దరు ఆడవాళ్లు వున్నారు. నా ఒంటిమీద బట్టలులేవు - మునగదీసుకొని కూర్చున్నాను. నావంక చూసి జాలివేసి, తన నడుముకి కట్టుకున్న తుండు తీసి నాకిచ్చాడాయన - దాన్ని మొలకు చుట్టుకున్నాను - మిగతా ముగ్గురు ఆయన తల్లి, తండ్రి, భార్య" - అంటూ జాలిగాధ చెబుతుంది మూలపాలెం వనిత అదే పుస్తకంలో.... ఆనాటి పశు నష్టమూ, ప్రాణ నష్టమూ ఆస్తి నష్టమూ అపారం. దివిసీమ ప్రజలు తమ జీవిత కాలంలో మరువలేని హృదయవిదార స్మృతులవి.... తొమ్మిదిన్నర కాలేదు మేము అవనిగడ్డ చేరుకొనేసరికి! అధ్యాపకులు కృష్ణమూర్తి, ఉప్పెన వివరాలూ చిత్రపటాలూతో కూడిన ప్రదర్శనశాల, జాలర్ల పిల్లల స్కూలు, అనాధ బాలబాలికల ఆశ్రమం, మరగానుగలు, కార్పెంటరీ వర్క్‌షాప్, ప్రింటింగ్ ప్రెస్, నిరాశ్రయుల శిబిరం, గాంధీ క్షేత్రంలో నిర్వహించే కార్యకలాపాలన్నీ చూపారు. కొంచెం ముందు వెళ్లడం వల్ల, గాంధీజీ ఆశయాల కనుగుణంగా అక్కడ జరుగుతున్న నిర్మాణ కార్యక్రమాలన్నీ శ్రద్ధగా చూడగలిగాము.

.... ఇవ్వాళ అవనిగడ్డ గాంధీ క్షేత్రంలో, ఖాదీగ్రామీణ పరిశ్రమల కమిషన్ సభ్యులైన మండలి వెంకట కృష్ణారావు అధ్యక్షులుగా, మాజీ ఉపరాష్ట్రపతి. బిడి జెట్టి ముఖ్య అతిధిగా స్వాతంత్ర్యసమర యోధుడైన స్వర్గీయ కోటగిరి వెంకట కృష్ణారావు రచించిన 'స్వాతంత్ర్య సామిధేని' గ్రంధావిష్కరణ, జవహర్ లాల్

నెహ్రూ తైలవర్ణ చిత్రావిష్కరణ ఉన్నాయి. మండలి బుద్ధప్రసాద్ ఆహ్వాన పత్రం నిన్ననే యిచ్చారుగాని ఎలానూ అవనిగడ్డ వెళ్తున్నాము కదా అని యింతవరకూ తెరిచి చూడలేదు. రామకృష్ణా మిషన్‌కి చెందిన ముగ్గురు స్వామీజీలు కూడా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. అప్పటికప్పుడు మమ్మల్ని మాట్లాడమనడంతో, రెండున్నరేళ్ల క్రితం వార్ధాలోని సేవాగ్రామ్ చూసి నప్పుడు ఎంత నిరుత్సాహం కలిగిందో యివ్వాళ అంత సంతోషం కలిగిందనీ గాంధీజీలోని ఆత్మతేజం యిక్కడ నిత్యచైతన్యంతో వెలుగొందుతోందనీ చెప్పాము. జెట్టీగారి చేత మాకు జ్ఞాపికలు (గాంధీజీ విగ్రహాలు - వైట్ మెటల్‌లో) యిప్పించి, సభ యింకా జరుగుతున్నప్పటికీ, మాకు వెళ్లేందుకు అనుమతి యిచ్చారు కృష్ణారావుగారు. బుద్ధప్రసాద్ కారు దాకా వచ్చి మమ్మల్ని సాగనంపారు. తిరుగు ప్రయాణం శ్రీకాకులం, మంటాడల మీదుగా. శ్రీకాకులేశ్వరుని ఆలయంలోకి వెళ్లి, మూల విరాట్‌నీ అమ్మవారినీ చూశాము. రామారావుగారు కబుర్లు చెబుతూనే వున్నారు. దారిలో డ్రయివర్‌గారి మాతామహుల యింటి వద్ద ఆగాం. చల్లటి మంచి నీళ్లు, గ్లాసులతో కమ్మటి మజ్జిగా తీసుకు వచ్చాడా యువకుడు. ఇంతవరకూ మేము డ్రయివరు అనుకుంటున్న వ్యక్తి డ్రయివరు కాదు - ఈ కారు ఆయనిదే! తను స్వయంగా డ్రయివ్ చేసి తీసుకు వస్తానని కృష్ణారావు గారితో అన్నా డట. విద్యాధికుడైన రాధాకృష్ణ మూర్తి పెద్ద కాంట్రాక్టరు - ఆయన తండ్రిగారు కూడా కాంట్రాక్టరే! సిస్టర్ బికామ్ పాసయిందట. చేతి సంచిలో బట్టలు పెట్టుకు, తను ఫలానా అని ఎవరికీ తెలియనీయకుండా, మాటా పలుకూ చెప్పకునేందుకు ఒక మిత్రుని సాయంగా తీసుకు, రోజుకి పదిహేనూ యిరవైమైళ్లు చొప్పున నడుస్తూ, కాలినడకని తిరుపతి వెళ్లి రావడం ఆయనకు సరదా. 'పుణ్యం మాట అటుంచి, ఆరోగ్యం బాగుపడు తుంది; మనసు ప్రశాంతంగా ఉం టుంది'-అన్నారాయన. 'ట్రెక్కింగ్'లో ఆయన పొందే అనుభవాల గురించి అడగాలని వుందిగాని అప్పుడే బెంజ్ సర్కిల్ దగ్గిర కొచ్చేశాము; కార్డు యిచ్చి, ఈసారి మద్రాసు వచ్చినప్పుడు తప్పకుండా మాయింటికి రమ్మనమని చెప్పాము.... 'మనోరమ' వద్ద దిగే సరికి ఒకటింబావు అయింది. గుమ్మం లోనే కనిపించారు రమణయ్యా రాజా - ప్రెస్ మీట్ పన్నెండు గంటలకి! నిన్ననే అన్నాడు కృష్ణ (రాజాగారి రెండో అబ్బాయి): 'అవనిగడ్డ వెళ్తే టైముకి రాలేరు, అంకుల్' - అని! .... ఈ సంవత్సరం రాజాలక్ష్మి అవార్డ్ సుప్రసిద్ధులైన సి నారాయణ రెడ్డికి (ఇరవై వేల నగదు - రెండు మూడు వారాలపాటు అమెరికా ప్రయాణం); లిటరరీ అవార్డ్ నాగ భైరవ కోటీశ్వరరావుకి (అయిదువేలు నగదు). ఇవ్వాళ శ్రీమతి రాజా (లక్ష్మిగారు) పుట్టినరోజు - అవార్డ్

ప్రకటన : నవంబరు 19 మిస్టర్ రాజా పుట్టినరోజు - అవార్డ్ ఇవ్వడం, ఆ ఫంక్షనూను! బహుమతి ప్రదానం మద్రాసులోనైన జరగవచ్చు; హైదరాబాదులోనైనా జరగవచ్చు.... మేము అవనిగడ్డ నుంచి తిరిగి వచ్చేసరికి, మాలతి అన్నగారు (గణపతి దీక్షితులు), మేనకోడలు (మధులత) నూజివీడు నుంచి వచ్చి రూమ్‌లో కూచున్నారు. 'మాలతీ చందూర్'కి సన్మానం యివ్వాళ, అని 'హిందూ'లో పడిందట - నిన్ననే అయిపోయిందని చెప్పాము .... గబగబా స్నానం చేసి, బట్టలు మార్చుకు, నాలుగు ముద్దలు నోట్లో వేసుకు, స్టేడియమ్‌కి సిద్ధమయాము. పుష్పక విమానంలాటి వాన్ ఉంది. లీడర్ దారి తీయాలంటూ బియస్సార్ జోక్ చేస్తూవుండగా, వాన్ ఎక్కి, గ్రవుండ్స్ చేరుకొనేసరికి, షామియానాలో ఒక వంద మంది కూడా లేరు. ఎండ పేల్చేస్తోంది - ఎవరికి వారు నీడ వెతుక్కుంటున్నారు. మురళీకృష్ణ (క్వాలిటీ పబ్లిషర్స్) మేయర్ జంధ్యాల శంకర్‌కి పరిచయం చేశారు ; కోనేరు కుటుంబమందరూ నిన్ననే పరిచయమయారు.... పళనిస్వామి నాదస్వరానంతరం, స్వాగతవచనం; ఆ తర్వాత బాలాజీ దర్శనం - హారతి. బాల మురళీకృష్ణ శిష్యుడు, ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో ఆర్టిస్టూ అయిన మోహనకృష్ణ భక్తిగీతాలు పాడారు .... విజయలక్ష్మీశర్మ, సునంద, రాధిక, భాగ్యలక్ష్మి, నారాయణ, రమణమూర్తిలతో జి ఆనంద్ నిర్వహించిన లలిత సంగీత కచేరీ ... బాల మురళి మనుమడు, యిదే అగష్టు 14వ తేదీన బాలమురళి తన తొమ్మిదో ఏట ఇదే ఊళ్లో పాడినట్లు పాడటం, సభికులకు ఆనందోత్సాహం కలిగించింది. ఎండ కొంచెం ఏటవాలై, వాతావరణం నెమ్మది నెమ్మదిగా చల్లబడటంతో తండోపతడంగా ప్రజలు

# మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటాయనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ప్రచురణ నిమిత్తం పంపే రచనలతోబాటు పోస్టుబిళ్లలు అతికించిన పొడుగు కవరు వుంటేకాని అంగీకారం కానివి వెనక్కి పంపడం సాధ్యం కాదు. మా ఊళ్లో 'జగతి' దొరకడం లేదనేవారికి ఒక్కటే మనవి - చందాదారులుగా జేరమని! రెండు సంవత్సరాలకి, అంటే 24 సంచికలకు, నలభైఅయిదు రూపాయిలు.

JAGATI Monthly, 2, Kutchery Road, P.B.2922 - Madras - 600 004.

వచ్చారు. కుర్చీలన్నీ నిండిపోయాయి; ఇరువైపులనున్న ఎన్క్లోజర్స్‌లో నేల మీద కూచున్నారు. నిన్న ఎలా ఉంటుందో చూదామనీ, యివ్వాళ ఎంత బావుందో చూదామనీ వచ్చారు. భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీ యివ్వాళ ఆరుగురిని సన్మానించింది. ఎలక్ట్రానిక్స్ రంగానికి చెందిన యువి వర్లు, యటామిక్ ఎనర్జీ శాఖకు చెందిన యమ్‌పిహెచ్ రావు, విద్యా రంగానికి అంకితమైన యమ్వి సుబ్బా రావు, సుప్రసిద్ధ పాత్రికేయులు బి యస్సార్ కృష్ణ, కూచిపూడి నాట్య ప్రవీణుడు వేదాంతం సత్యనారాయణ, సంఘసేవా నిరతులు జాఫర్ షెరీఫ్. 'బిసిఐసి' అధ్యక్షులు బిడి జెట్టి, విజయ వాడ ఉత్సవకమిటీ లక్ష్మయ్య, నగర మేయరు జంధ్యాల శంకర్ ఈ ఆరు గురు ప్రముఖులనీ సముచిత రీతిని సత్కరించారు.... ఉమా మురళీకృష్ణ (ప్లేబాక్ జానకి కోడలు) తన నాట్య ప్రదర్శనతో ప్రేక్షకులని మెప్పించింది.... గణపతి, మధులత ఎనిమిది గంటలకు నూజివీడు వెళ్లవలసి వుండటంచేత, 'మనోరమ'కి వచ్చి, వారిని పంపించి స్నానాలుచేసి, కాస్త కాఫీ తాగి బయలుదేరాం స్టేడియమ్‌కి. వాన్‌లో మాతో వచ్చిన వ్యక్తి హేమంతీ శుక్లా అని, ఆమెని వేదిక మీద చూశాక గాని తెలియలేదు. మేము తిరిగి వచ్చేసరికి గాయత్రి వీణ, ఉస్తాద్ అక్బర్ హుస్సేన్ సితార్ - వారి జుగల్‌బందీ మాంచి రసపట్టులో ఉంది. నిన్న రమణీ జోగ్‌ల జుగల్‌బందీకి తన్మయులైనట్లే యివ్వాళ ఆ వీణసితార్‌ల సంయుక్త గాన మాధుర్యంలో మునకలు వేశారు. అంతటి జన సందోహం, ఆ శాస్త్రీయ సంగీతాన్ని అంత శ్రద్ధగా ఆలకిస్తున్నారూ అంటే, అది ప్రజా హృదయంలో నిద్రాణంగా వున్న సంగీత వారసత్వం. కూచిపూడి నర్తకి శోభా నటరాజన్ రత్న మాణిక్యాల వంటి మూడు అయిటమ్స్ చేసి మెప్పించింది. హేమంతీ శుక్లా, అద్వితీయ గాత్ర వైభవంతో, భజన లందుకొనేసరికి, పదకొండున్నర దాటింది. ఒక్కళ్లు సీటులో నుంచి కదిల్తేనా? ఆ గాన స్రవంతిలో బాహ్య ప్రపంచాన్ని, కాల గమనాన్నీ మర్చిపోయారు. సభికుల కోరిక మీద ఒక బెంగాలీ పాట కూడా పాడారు - ఎంతో శ్రావ్యంగా హేమంతీ శుక్లా, పన్నెండున్నరా ఒంటి గంటకు ప్రారంభమయింది బాలాజీ కళ్యాణోత్సవం. తిరుపతిలో ఏవిధంగా జరుగుతుందో అదే రీతిని, అవే వేద మంత్రాలతో, అదే తీరున శాస్త్రోక్త విధులతో వెంకటేశ్వరుని పరిణయం భూదేవీ శ్రీదేవీలతో జరిగింది. సప్త గిరి వాసుని పల్లకిలో ఊరేగిస్తున్నప్పుడు, భక్తులు ముక్త కంఠంతో గోవింద నామస్మరణ చేశారు. అలాగే 'జోజో అచ్యుతానంద జోజో ముకుందా' అని పవళింపు సేవ, ఈ రెండురోజుల ఉత్సవంలో పాల్గొన్న గాయనీ గాయకులందరూ పాడుతున్నప్పుడు ఆ సంగీత కెరటాలు చుట్టూగల సమస్త ప్రకృతిని పరవశింపజేశాయి. కళ్యాణం జరుగు

తున్నప్పుడు, రెండు చినుకులు పడగా, దానిని పూలజల్లుగా వ్యాఖ్యానించారు ఆషాలత. నిన్న మధ్యాహ్నం నుంచీ ఈ రాత్రి రెండున్నరదాకా కార్య క్రమావళిని ఎంతో ఓపికతో, శ్రద్ధా భక్తులతో, ఏకాగ్రతతో నిర్వహించారు రావి కొండల్రావు. సంగీత కార్యక్రమ వ్యాఖ్యాతగా మహతి, వెంకటేశ్వర పూజా కార్యక్రమ వ్యాఖ్యాతగా ఆషా లత మొత్తం ప్రోగ్రామ్‌కి పరిమళం సమకూర్చారు. కోనసీమ నుంచి వచ్చిన ఘనాపాటీల వేదపఠన మరుపురానిది - శ్రవణానందదాయమైన ఆ శబ్దధార, తెలియని లోకాల వైపుగా మనసుని మళ్లిస్తుంది. 'బిసిఐసి' ఫంక్షన్ ఢిల్లీలో జరిగినా, భిలాయ్‌లో జరిగినా, విజయవాడలో జరిగినా మొత్తం పార్టీకి వేర్వేరు తరగతులలో రాను పోనూ బుకింగూ, యితర లగేజీ సక్రమ రాక పోకలు, రోజూ పూజకు మద్రాసు నుంచి పువ్వులూ యిలాటి వాటన్నిటిలో 'బిసిఐసి' కి ఎంతో సహాయం చేస్తు న్నారు సదరన్ రయిల్వే సీనియర్ కమర్షియల్ ఆఫీసరు చక్రధరరావు - ఈ రెండురోజుల ఉత్సవం ఆయన కూడా స్వయంగా చూశారు. ఈ ఉత్సవ విజయానికి కోనేరు కుటుంబమూ జంధ్యాల శంకర్‌తో బాటు ఎందరో, ఎందరెందరో మహానుభావులు నడుం కట్టారు. రెండూ ఇరవైకి మేమూ గాయత్రీ దంపతులూ వాన్‌లో కూచు న్నామో లేదో హెూరున బ్రహ్మాండ మైన వర్షం - మొన్న ఉదయం కారు డ్రయివరు చెప్పిన మాటలే జ్ఞాపకం వచ్చాయి. ఏడుకొండల వాడు తన కళ్యాణం జరిపించుకొనేదాకా వర్షం పడనివ్వడు - అని మూఢ భక్తితో అతను చెప్పిన మాటలే, ఇక్కడి వాతావరణమూ ఇన్ని వేల గుండెల లోని సచ్చింతనా బలమూ సంకల్ప శుద్ధీ నిజం చేశాయి. అరవై దెబ్బ య్యేళ్ల క్రితమైతే దానిని మిరాకిల్ అనీ, మహత్యమనీ అని వుందురు. కాని, ఈనాడు అలా అనము, అనలేము. మంచితనమే దేవుడంటాం; మంచితనమూ మానవత్వమూలోనే సత్యమూ సౌందర్యమూ ఉన్నా యంటాము. ఆత్మ విశ్వాసంతో కూడిన ఆరాధన, సగుణోపాసన కావచ్చు, నిర్గుణోపాసన కావచ్చు. 'సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి' - అందులో అల్లా ఉన్నాడు, జీసస్ ఉన్నాడు; శివ వైష్ణవులు ఉన్నారు; ఆదిశక్తి ఉంది: అంతర్యామి ఉన్నాడు..... దేశ సమైక్యత సమగ్రత ప్రధాన ధ్యేయంగా గల భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీ వారి పన్నెండవ సంగీత నాట్యోత్సవాలు విజయవాడలో జయప్రదంగా ముగి శాయి. పదమూడో ఉత్సవం ఈ నవంబరులో న్యూఢిల్లీలో జరుగు తుంది.... ఉత్సవ నిర్వహణకు, అర్చ కులు, వాద్యకారులు, వంటవారూ మొత్తం నూట ఏభైమంది మద్రాసు, తిరుపతిల నుంచి వస్తారు. యస్వెస్ రాజు, ప్రభాకరరావు, రామ్మూర్తి, కామేశ్వర శర్మ వంటివారు వైజాగ్ హైదరాబాదుల నుంచి వస్తారు.

దేవుడి పెళ్ళికి అందరూ పెద్దలే అయి నప్పటికీ ఎవరి బాధ్యత వారికుంది. ఉత్సవ రథసారధి: టివికె శాస్త్రిగారు. అందరినీ తన చిరునవ్వుతో కూడ గట్టుకొనే అద్వితీయ ఆర్గనైజర్ - నేషనల్ సిటీజన్‌గా ఉపరాష్ట్రపతి వద్ద నుంచి గుర్తింపు పొందారు మా శాస్త్రిగారు. మద్రాసు తెలుగు అకాడమీ, భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీ - ఈ రెండూ ఆయన పెంచి పోషిస్తున్న పూలమొక్కలు, - వృక్షరాజాల వంటి సాంస్కృతిక సంస్థలు.

. . . . . 15

పదకొండు గంటలకి గుంటూరు నుంచి మంగాదేవి, ప్రభా వచ్చారు. మమ్మల్ని అమరావతి తీసుకు వెళ్ళేందుకు! ఈసారి కాదు, మరొక సారి వెళ్ళామన్నాము. మిసెస్ జివిజి (పద్మావతి), ఆమె చీరాల స్నేహితురాలు, మంగాదేవి, ప్రభ అందరం మా రూమ్‌లోనే కూచుని, ఎన్నెన్నో పాత కథలతో గంటల్ని నిముషాల్లా మార్చాం. బేరర్ తెచ్చిన భోజనాలు, పద్మావతిగారే చక్కగా సర్ది వడ్డించారు. అయిదు గంటలకి ఒకరు చీరాల, మరొకరు గుంటూరు తమ తమ వాహనాలలో వెళ్ళగా, ఆరున్నరకి పర్కా రెక్కేందుకు మేము స్టేషన్‌కి! బియస్సారూ, గాయత్రి భర్త గుంటూరులో జాయినయారు. పదహారు ఉదయానికి మద్రాసు.

. . . . . 20

డా॥ అనసూయాదేవి 'పండగలు పూజలు, పాటలు', 'సంవాదాలు - సంప్రదాయ పాటలు' అనే రెండు పుస్తకాల ఆవిష్కరణోత్సవం శ్రీ సేవా మందిర్ వారి అశోక్ నగర్ 'మహోదయ' హాలులో జరిగింది. వ్యవస్థాపకురాలు మిసెస్ ఎసి కృష్ణారావు ఆహూతులకు స్వాగతం తెలుపుతూ, యింఁదరు తెలుగువారు ఈ సందర్భంగా యిక్కడ సమావేశం కావడం ఆనంద ప్రదంగా ఉందన్నారు. జానపద సంగీతం అనాది, శాస్త్రీయ సంగీతం పునాది - అన్నారు పుస్తకా విష్కరణ గావిస్తూ. సంగీత కళానిధి బాలమురళీ కృష్ణ ఈ పుస్తక ప్రచురణకి ఆర్థిక సహాయం గావించిన బివి యస్సెస్.... మణి గారికి ప్రథమ ప్రతిని అందజేశారు. ముఖ్య అతిథి టి యస్ పార్థసారధి (మ్యూజిక్ అకాడమీ సెక్రటరీ) జానపదుల జీవితాలలో సంగీతం ఎలా పెనవేసుక పోయినదీ తెలిపారు. ప్రఖ్యాతగాయని జానకి, అనసూయాదేవిని వేదికపై సత్కరించారు గాని అనారోగ్య కారణంగా మాట్లాడలేదు. ఈ మద్రాసు వచ్చిన కొత్తరికంలో, గోవిందరాజుల సుబ్బారావు గారి హోమియో వైద్యశాలలో, అనసూయ తనని ఎలా పల్కరించి స్నేహబంధం పెంచినదీ చెబుతూ, వెనకటి తరం లోని ఘాలి సుబ్బారావు వంటి వారి కృషిని ప్రస్తావిస్తూ, అనసూయాదేవి సేకరణను ప్రశంసించారు మాలతీ

వండూర్. నేదునూరి గంగాధరం వంటి వారు జానపద సాహిత్యంలో అపూర్వ కృషి చేశారనీ, కాని జాన పద సంగీతంలో పరిశోధన గావించిన గౌరవం అనసూయాదేవిదనీ, భావ కవిత్వానికి సంగీత శోభ నిచ్చిన వారు సీతా అనసూయలనీ, వారు స్వయంగా పాడినప్పుడు వినే అవకాశము తనకి కలగలేదనీ అన్నారు, త్రిభాషా పండి తులు పప్పు వేణుగోపాలరావు. అన సూయాదేవి సముచిత సమాధానం, నాగ మణీ కొండల్రావు వందనసమర్పణాతో పుస్తకావిష్కరణ సభ ముగిసింది. అన సూయాదేవి ఈ నెల ఇరవై అయిదున స్టేట్స్ వెళ్తున్నారు - అక్కడి తెలుగు వారికి ఈ పాటలు పరిచయం చేయ గలరనీ నేర్పగలరనీ ఆశిస్తున్నాము. (స్వర్గీయ కొనకళ్ల వెంకటరత్నం 'మొక్కజొన్న తోటలో ముసిరిన చీకట్లలో సందెకాడ కలుసుకో మరువకు మామయ్యా' - ఈసోదరీమణులు పాడిన జానపద రికార్డులలో బహుళ ప్రచారం పొందింది. ఆ పాట యింకా రెండేళ్లకు వెలుగులోకి వస్తుందనగా, కొనకళ్ల వెంకటరత్నం తనే వరసకట్టి, ఏలూరు లో మా యింటికొచ్చి, మాలతికి నేర్పేవారు - అప్పట్లో ఎవరైనా పాడ మనటం తరువాయిగా మాలతి పాట లందుకొనేది. మొన్న ఆగస్టు 12 వ తేదీన నూజివీడులో వైద్యుల నారాయణ రావుని కలుసుకున్నప్పుడు 'గీత గోవిందం పాడించే వాణ్ణి మాలతి చేత - ఒక రోజున గంటసేపు పాడిం చాను' అన్నారాయన.... విన్నప్పుడు కంఠం బావుండి పాడటం వేరు - సంగీత సాధన వేరు)

. . . . . 21

సినీ ఆర్టిస్ట్ మాడా వెంకటేశ్వర రావు విజయలక్ష్మి దంపతుల కుమార్తె సౌ॥ అనురాధకు, కాకినాడ కస్టమ్స్ అండ్ సెంట్రల్ ఎక్సయిజ్ యినస్పెక్టరు కెవి కొండల్రావు కుమారుడు చి॥ శ్రీనివాస్‌కు ఈ ఉద యం 11-35 ని ॥ లకు శాస్త్రోక్తంగా వివాహం జరిగింది రాజేశ్వరీ కళ్యాణ మండపంలో. వధువు ఎమ్ఎ లిటరేచర్, వరుడు ఎమ్‌బిబియస్. రామానాయుడు, డివియస్ రాజు, రాఘవేంద్రరావు, బాపయ్య, డివి నరసరాజు మున్నగు ప్రముఖు లెందరో వచ్చి వధూ వరులపై శుభాక్షితలు చల్లారు. ముహూర్తానంతరం లంచ్. సాయింత్రము బాలసుబ్రమణ్యం, జి ఆనంద్ పార్టీ వారి మ్యూజిక్, ఆ పైన డిన్నర్. నవదంపతులకు మా శుభాకాంక్షలు.

. . . . . 22

అంబాసిడర్ పల్లవిలో సినీస్టార్. చిరంజీవి జన్మ సందర్భంగా లంచ్, సరిగ్గా ఒంటి గంటన్నరకి బర్త్‌డే కేక్ కోసి, నిర్మాతలకు, పంపిణీదారులకు, కొనుగోలు దారులకు, పాత్రికేయులకు, తననింతగా అభిమానిస్తున్నందుకు కృతజ్ఞతాభివందనలు తెలిపారు చిరం జీవి. తెలుగు సినీ పరిశ్రమలోని ముఖ్యులంతా అక్కడే వున్నారు. నిగర్వి, నిరాడంబరుడు, నిర్మలాం తరంగుడు అయిన చిరంజీవికి మా

శుభాకాంక్షలు. పది పన్నెండేళ్ల క్రితం క్రాంతికుమార్ ఆఫీసులో మొదటి ప్రెస్ మీట్ జరిపిన చిరంజీవి, నటనలో ఓనమాలు నేర్చుకుంటున్న విద్యార్థి ; ఇప్పుడు ప్రేక్షకులని, రసజ్ఞులని విమర్శకులని మెప్పిస్తున్న సూపర్‌స్టార్. 'రుద్రవీణ' నచ్చకపోతే, 'యముడికి మొగుడు' చూడండి - అన్న మహా నటుడు.... ఈ సాయింత్రము మెరీనాలో భారీ ఎత్తున అభిమాన సంఘాలు చిరంజీవిని గౌరవింప నున్నాయి. విశ్వనాథ్, దాసరి నారాయణరావు, రాఘవేంద్రరావు, కోదండరామి రెడ్డి మున్నగువారు ఆయనని అభినందిస్తారు. డైనమిక్ మూవీ మేకర్స్ వారి 'యముడికి మొగుడు' చిత్రం 116వ రోజు వేడుకలు, 47 థియేటర్లలో నూరు రోజులు విజయవంతంగా ప్రదర్శింపబడిన ఘనత ఆ చిత్రానిది ....పి ఆర్ ఓ : ఆంజనేయులు.

.....26

హోటల్ శ్రీలేఖా ఇంటర్ కాంటినెంటల్‌లో 'నేషనల్ రాజీవిస్ట్ ఫ్రంట్' National Rajivist Front వారి మొదటి పత్రికా గోష్టి. ప్రధాన పత్రికల వారందరూ వచ్చారు...."ఇంటా బయటా అనేక యిబ్బందులని ఎదుర్కోవలసిన పరిస్థితి ఏర్పడుతోంది మనదేశానికి. పార్లమెంటరీ డెమొక్రసీని పరిరక్షించుకుంటూ, దేశసమగ్రతను, సమైక్యతను కాపాడుకోవటం మన కర్తవ్యమై ఉంది.... రాజీవ్‌గాంధి తలపెట్టిన ప్రతి కార్యక్రమాన్నీ తప్పుబట్టడమే ధ్యేయంగా కొన్ని శక్తులు అవతరించాయి. ఆ ప్రగతి నిరోధక శక్తులను సామాజిక రంగంలో ఎదుర్కోవడమే ఈ ఫ్రంట్ లక్ష్యం. మాకు రాజకీయాలతోను, రాజకీయ పార్టీలతోను ఏమీ సంబంధం లేదు. జాతీయతను ప్రోది చేస్తూ, జాతి భవితవ్యాన్ని బాగుచేయడమే మా ఆశయం. ఈ బృహత్ ప్రయత్నంలో పత్రికల వారి సహకారం వినయపూర్వకంగా కోరుతున్నాం" - అన్నారు నేషనల్ ఎగ్జిక్యూటివ్ అధ్యక్షురాలైన సత్యాదేవి. 'నేషనల్ రాజీవిస్ట్ ఫ్రంట్' వారి 'నేషనల్ కన్వెన్షన్' త్వరలోనే మద్రాసులో జరుగనున్నదని తెలిపారు.

.....27

ప్రత్యేక వరవడి గల పాత్రలని సమర్థవంతంగా పోషించి, సినీ ప్రేక్షకుల ఆదరాభిమానాలు చూరగొన్న సౌ॥ సుహాసిని (చారుహాసన్ దంపతుల కుమార్తె) చి॥ మణిరత్నమ్ (వెంకటేశ్వరన్ దంపతుల కుమారుడు) భార్యాభర్తలైన సందర్భంగా ఈ సాయింత్రం విజయా శేష్ మహల్‌లో రిసెప్షన్. సినీ ప్రపంచమంతా అక్కడే ఉంది. యస్ రమణి ఫ్లూట్.... నూతన వధూవరులకు మా మనః పూర్వక శుభాకాంక్షలు.

.....28

ఎస్సార్ సినీ ఎంటర్‌ప్రైజెస్ వారి 'ప్రేమించి చూడు' పాటల ప్రద

ర్శన యమ్మెమ్ థియేటర్లో....
'పూసల' మూలకథకు ఆదివిష్ణు
రచన; చిత్రానువాదం, దర్శకత్వం :
త్రిపురనేని వరప్రసాద్, రాజేంద్ర
ప్రసాద్, స్మిత ఒక జంట; చంద్ర
మోహన్, పూర్ణిమ మరొక జంట.
నూతన్ ప్రసాద్, వీరభద్రరావు,
కోటశ్రీనివాసరావు, మాడా, శ్రీలక్ష్మి,
కాకినాడ శ్యామల, రాధాకుమారి
మున్నగువారున్నారు. 'బ్రహ్మ' గా
సత్యనారాయణ.... 'ఈ గాలి తరగల
తేలి, మేఘాలే తాకేదాకా' కలలు
పండేటట్లు వుయ్యాల వూగుదామను
కుంటారు నాయికా నాయకులు
(గాత్రం : చిత్ర - నాగూర్, గేయం :
సీతారామశాస్త్రి)....'కోకిలమ్మా కూయ
వమ్మా, గుండె కోనలో చిందాడ
వమ్మా - వెండి వానల్లో ముద్దాడు
దామా' - అని రెండు జంటలూ
కవ్వించుకుంటాయి. (గాత్రం : శైలజ,
నాగూర్; గేయం: జాలాది). అలాగే
జొన్నవిత్తుల రచన 'అకాశ దేశాన....'
ఒక పారడీ. మొత్తం అయిదు పాటలు.
నిర్మాత : స్మిత.... పి ఆర్ ఒ :
జగన్ .... అభ్యుదయ రచయితల
సంఘం పొట్టి శ్రీరాములు హాలులో
జరిపిన సాహిత్య గోష్ఠిలో నేటి కథా
నిక గురించి 'శ్రీవిరించి' మాట్లాడారు.
తెలుగులో మంచి కథలు వెలువడక
కాదు, వాటిని సంపుటీకరించి వేసే
వారు అరుదవుతున్నారు. సంవత్స
రానికి రెండు మూడు సంపుటాలైనా
అలాంటివి వేయాలి, వాటి ఆంగ్లాను
వాదాలు వెలువడితేనే తెలుగు కథకి
గుర్తింపు లభిస్తుంది - అన్నారు
శ్రీవిరించి. సాహిత్యకారుడు సైతం
జీవన సంఘర్షణలో సతమత
మవుతూండటం వల్ల పరిశీలనా పటి
మను కోల్పోతున్నాడు - అన్నారు -
అభ్యుదయ వేదికకు అధ్యక్షత వహిం
చిన బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు.

—యన్నార్ చందూర్

భగవద్విశ్వాసమనగా కళ్ళకు కన
బడని దానిపై నమ్మకం వుంచడం.
ఆ విశ్వాసానికి ప్రతిఫలమేమనగా,
హృదయాకాశంపై ఆ కనబడనిది
ప్రతిబింబించి జీవితాన్ని వెలుగుతో
నింపుతుంది. —సెయింట్ అగస్టిన్

యుద్ధానికి వెళ్లి వచ్చినవారి కబుర్లు
సరదాగా ఉంటాయి - వారు యుద్ధం
చూశారు గనక! చంద్రుని గురించి
కవులు చెప్పే కబుర్లు కఠోరంగా ఉం
టాయి - వారు చంద్రుని పద్దకు వెళ్ల
లేదు గనక! —మార్క్ట్వేన్

కుటిల మనస్కులు తమ తప్పులని
తమ నుంచీ, యితరుల నుంచీ కూడా
దాస్తారు. సజ్జనులు మాత్రమే తమ
తప్పులు బాహాటంగా అంగీకరించ
గలుగుతారు. —లారో.

జ్ఞాపకం పెట్టుకోవడం ఒక ఎత్తు;
తెలుసుకోవడం ఒక ఎత్తు. జ్ఞాపకాని
కని వొప్పగించిన విషయాన్ని భద్ర
పరుస్తుంది జ్ఞాపకశక్తి. తెలుసుకోవడ
మనేది అలా కాదు - మీలో అంత
ర్భాగమె పోతుంది. —సెనెరా



# కేంద్ర సాహిత్య అకాడెమి

## ఇటీవల వెలువడిన తెలుగు ప్రచురణలు

☐ మట్టి దీపం (తమిళ నవల) — రూ. 25-00
— ఎమ్. వరదరాజన్

☐ నగర మథనం (డొగ్రి - అంగ్లం : శివనాథ్) — రూ. 12-00
— సి పి శర్మ

☐ జనవాహిని (అస్సామీ) — రూ. 30-00
— డా॥ బీరేంద్రకుమార్ భట్టాచార్య

☐ సమాజపు కోరల్లో (తమిళం) — ................
— నా. పార్థసారథి....

☐ తెలుగుకథ — రూ. 40-00
— సం. డి రామలింగం

☐ తెలుగు కావ్యమాల — రూ. 30-00
— సం. కాటూరి వెంకటేశ్వరావు

## భారతీయ సాహిత్య నిర్మాతలు

(ఒక్కొక్క ప్రతి వెల రూ. 4/-)

☐ జ్ఞానదేవుడు ☐ కల్హణుడు ☐ మహాకవి ఉళ్లూర్ ☐ మాణిక్యవాచగర్
☐ నామదేవుడు ☐ నర్మదా శంకర్ ☐ నజీర్ అక్బరాబాది ☐ పోతన
☐ సరళదాసు ☐ తుకారామ్ ☐ వీరేశలింగం ☐ విద్యాపతి

(ఒక్కొక్క ప్రతి వెల రూ. 5/ )

☐ డా॥ సి. ఆర్. రెడ్డి ☐ దత్తకవి ☐ భవభూతి ☐ శ్రీ అరవిందులు
☐ నమ్మాళ్వార్ ☐ మహర్షి దేవేంద్రనాథ్ టాగూర్

వివరాలకు వ్రాయండి:

## సాహిత్య అకాడెమి

- 1 - బొంబయి 14 - మద్రాసు 18 - కలకత్తా 29

సాహిత్య అకాడెమి
దక్షిణ ప్రాంతీయ కార్యాలయం :
29, ఎల్డామ్స్ రోడ్డు, మదరాసు - 600 018 (ఫోన్ : 454080

## సమీక్షలు

# చిత్రజగతి

### జలజా వారి 'మిస్టర్ హీరో'

పోలీసు ఇనస్పెక్టరు అమర్ (రాజశేఖర్) ముగ్గురు భయంకర హం కులని వెంటాడుతూ మిస్టర్ హీరోగా పరిచయమవుతాడు. కోర్టులో ఆ ముగ్గురికీ మరణదండన పడుతుంది. గట్టి బందోబస్తుతో జైలుకి పంపుతూండగా, విలన్ ముఠా కాపు కాసి, పోలీసులని చిత్తు చేసి, 'డేంజరస్ క్రిమినల్స్'ని రక్షించుకుంటుంది. వెండి తెర మీద కనిపించే గ్లామరస్ విలన్‌కి మోటారు సైకిలు మనుషులూ పిస్తోళ్లూ, బాంబులూ అపారంగా ఉంటాయిగాని ఒక్కోసారి తిండి ఉండదు. విలనూ, ఈ ముగ్గురూ పట్టెడన్నం కోసం గిల గిల్లాడుతున్నప్పుడు ముగ్గురిలో ఒకడు బయటికెళ్లి ఉచ్చులో యిరుక్కుంటాడు. అమర్ చెల్లెలే ఈ విలన్ భార్య, వైభవంగా పెళ్లిచేసి పంపిన చెల్లెలు, మళ్లీ కనపడక పోవడంతో, ఆమె జాడ తెలుసుకునేందుకే ఈ ఊరు ట్రాన్స్‌ఫర్ చేయించుకున్నాడు ఇనస్పెక్టర్ అమర్. సగంలోకి వచ్చేసరికి ఈ అమరూ అతని చెల్లెలూ అమరులవుతారు. ద్విపాత్రాభినయ చిత్రం గనక ఆటో డ్రైవర్ నైజామోడు (రాజశేఖర్) అశ్వనితో మిగతా సగం సాయం పడతాడు - మిస్టర్ హీరోగా, అశ్వని ప్రేక్షకులని మెప్పించగా, ముక్కుపుడకతో పోలీసు యినస్పెక్టర్ పాత్రలో జీవిత 'యింప్రెస్' చేయలేక పోతుంది. చిత్రంలో సందర్భోచితి గాని, కథా బలంగాని లేవు. దర్శకులు: సత్యారెడ్డి. నిర్మాత: లక్ష్మణస్వామి.

### సురేష్ వారి 'బ్రహ్మ పుత్రుడు'

సినిమా కథను అర్థవంతంగాను, ఆకర్షణీయంగాను చేయడంలో గుహనాథన్‌కి ఒక ప్రత్యేకత ఉంది. ఆ ప్రత్యేకతకు దాసరి నారాయణరావు మాటలూ స్క్రీన్‌ప్లే తోడైనప్పుడు, అది మరింత రాణించడంలో ఆశ్చర్యం లేదు. యువప్రేక్షకులకి కావల్సిన ఫైట్సూ, పరిణత మనస్కులు కోరే సామాజిక దర్పణం, ఏ దృశ్య చయనికకైనా ఊపిరిపోసే సరసశృంగారం, గుండెలు పిండే కరుణ రసార్ద్రత, 'అమ్మతోడు లేకున్నా, నాన్నతోడు లేకున్నా, నీకు నాకు ఉన్నతోడు

కన్నీళ్లే నమ్మా' (దాసరి రచన) అని బేబీని బుజ్జగించ గల ధీరలక్షణం, కథానాయిక (రజని) కవ్వింపులకన్నా కర్తవ్యపాలన ముఖ్యమని ముందుకి సాగడం - యిన్ని ప్లస్ పాయింట్లు వున్న ఈ చిత్రంలో జనరంజన, మనోరంజన రెండూ వున్నాయి. తల్లిని జైలుకి పంపిన పరమనీచుడు తన తండ్రి (నూతన్‌ప్రసాద్) అని తెలిసిన శక్తి, ఒంటరిగా పెరిగి, రంజిత్ (మోహన్‌బాబు) ప్రేరణతో సాహసుడై, తల్లి పిచ్చిది కాగా, తండ్రి ఎవరో తెలియకపోయినా ఆ తండ్రిని తల్లి (జయసుధ) ముందు నిలబెట్టి ఆమె పిచ్చి నయం చేదామని గంపెడాశతో వచ్చిన బేబీని (షాలిని) ఆదుకోవడం యిందులోని ప్రధాన యితివృత్తం. వెంకటేష్ ఈ తొమ్మిదో చిత్రంతో ఎంతో ఎత్తుకి ఎదిగాడు. చక్రవర్తి సంగీతం; దాసరి దర్శకత్వం. నిర్మాత : రామానాయుడు.

## శ్రీనాథ్ వారి 'మా తెలుగు తల్లి'

పరుచూరి బ్రదర్స్ కథ మాటలు సమకూర్చి, స్క్రీన్‌ప్లే రూపొందించి, దర్శకత్వం వహించిన ఈ చిత్రంలో, విద్యార్థుల కోసం మెస్ నిర్వహించే అన్నపూర్ణ (శారద) యువతను క్రమమార్గాన నడపాలనే దీక్షాపరురాలు - బెత్తం చేత బుచ్చుకు ఎంతటి వారినీ గద్దించ గల సమర్థురాలు. ఒక ధృతరాష్ట్రుని (అల్లు రామలింగయ్య) కుమారులైన దుష్ట చతుష్టయం ఐకమత్యమే బలం అనే దానికి, వక్రభాష్యంగా జీవిస్తూ, స్వంత లాభం కోసం, స్వజన రక్షణ కోసం చేయరాని పనులన్నీ చేస్తూ, చేయిస్తూ వుంటారు. వీరికి మద్దతు ఒక పోలీసు యినస్పెక్టరు (నూతనప్రసాద్) - ఇరవై ఏళ్లుగా ఆయన అదే ఊళ్లో వుండి, ఆ నలుగురి ఆశ్రయంలో నదురూ బెదురూ లేకుండా బతకగలడం సినిమా న్యాయం. వెనకటి లాండ్ సీలింగ్ చట్టంతోను, 1988 మే నెలలో జారీ అయిన 'బినామీ' ఆర్డినెన్స్‌తోను ఈ కథను ముడిపెట్టడం బావుంది. ఆ సూత్ర బంధమే ఫార్ములా చిత్రానికి పటుత్వాన్నీ నవ్యతనీ ఇచ్చింది. ఉగ్రవాదిగా ముద్రపడిన పరశురామ్ (రంగనాథ్), పేదల పెన్నిధిగా పేరొందిన న్యాయవాది గాంధీరాజు (పరుచూరి), తమ్ముడిని కలెక్టరు చేదామనుకున్న ఆటోడ్రయివరు (మురళీమోహన్) మున్నగు వారితో కథ నడుస్తుంది. కాకీ డ్రస్‌లోని అతివల చేష్టలు, కాలేజీ విద్యార్థుల పిక్‌నిక్ సమంజసంగా లేవు. నిర్మాత : అలపాటి రంగారావు. సమర్పణ : శివలింగేశ్వరరావు.

## భాను ఆర్ట్ వారి 'ప్రచండ భారతం'

ఒక రిటైర్డ్ జడ్జీ (గుమ్మడి), ఒక రిటైర్డ్ యస్పి (ప్రభాకర రెడ్డి) పాయిలా పాయిలా కబుర్లు చెప్పుకుంటూ వాకింగ్‌కి వెళ్తున్నప్పుడు, రెండు రోజులుగా అక్కడ పడివుండి కుళ్లు

కంపు కొడుతున్న శవం కనపడుతుంది. ఎవరికి వారు తమకి సంబంధం లేనట్లు పోతున్నారు; మునిసిపాలిటీ వారు పట్టించుకోరు. ఈ పింఛినీదారులిద్దరినీ ఒక నిఖిలేశ్వర్ (సత్యనారాయణ) నిలదీసి అడుగుతాడు : మీరు మీ మీ ఉద్యోగాలలో ఉన్నప్పుడు మనస్సాక్షిని విస్మరించి, సామాజిక దుర్గంధం పెరగడానికి ప్రోదిచేసినది మీరు కాదా? - అని! కొంచెం తికమక పడ్డ తర్వాత యిద్దరు పెద్దలూ నిఖిలేశ్వర్‌తో కలిసి, ఆ శవాన్ని బుజాల మీద కెత్తుకుంటారు; ఎక్కడనుంచో వూ డి ప డ తా డు మామూలు కోసం, పోలీసు కానిస్టేబుల్ (రావి కొండలరావు) .... ప్రజాఉద్యమమే శరణ్యమని నమ్మిన నిఖిలేశ్వర్‌కి, విజయ్ (కృష్ణంరాజు) తటస్థపడతాడు. మంత్రిగారు (కోట శ్రీనివాసరావు), కాంట్రాక్టరు, ఫాక్టరీ యజమాని, గూండా కింగ్ - ఈ నలుగురినీ అహింసా పద్ధతిలో ఎదుర్కొంటారు ఉద్యమకారులు. ప్రభుత్వానికి గల పాశవిక శక్తి, విప్లవ శంఖం ముందు నిస్తేజమవుతుంది. ఆర్టిస్ట్ గౌతమి ఈ చిత్రంతో స్టార్ అయిందనడంలో సందేహం లేదు. దర్శకత్వం: ప్రభాకరరెడ్డి.

## యువచిత్రా వారి 'జానకి రాముడు'

ప్రేమ అమరమైనది, అపురూపమైనది, అమృతోపమానమైనది, ఆజన్మ బాంధవ్య జనితమైనదీ అని చెప్ప బూనే ఈ చిత్రంలో జట్కా బండి రంగడు (నాగార్జున్) మునసబు గారి (జగ్గయ్య) అమ్మాయి లక్ష్మి (విజయశాంతి) పరస్పరం ప్రేమించుకుంటారు. షాక్ వల్ల గళం పోయిన లక్ష్మికి, మరొక షాక్‌తో మాట తెప్పించిన రంగడు ప్రాచీన ప్రేమారాధకుడు. సన్నాయి బత్తుని (సాక్షి రంగారావు) కూతురు స త్య వ తి (జీవిత) నూరు అబద్ధాల సామెతని సహస్రంగా మార్చి, ఆ వెయ్యి అబద్ధాల అనంతరం రంగడు తన మెడలో తాళి గడతాడని ఆశపడుతుంది. కాని, ఆ ప్రేమోపాసకుడు, లక్ష్మిని కౌగిలిలోకి తీసుకోవడం కళ్లారా చూసి, ప్రేమ పూజారికి స్వయంగా ప్రేమాభిషేకం జరిపించడం తన కర్తవ్యంగా భావించి, అవరోధం తొలిగించేందుకు తను మరొకరిని నిముషాల మీద పెళ్లాడి, మూడు నెలలు తిరక్కుండా తెల్ల చీరెతో పుట్టింటికి వస్తుంది ఈ సత్యవతి. బలవంతరావు (మోహన్ బాబు) ప్రవేశంతో, కథాగమనానికి ఫార్ములా పద్ధతి చేకూర్చి, లక్ష్మి రంగల పెళ్లికి ఆటంకం ఏర్పడుతుంది. ఆ జమీందారీ గ్రామంలోని పంచాయితీ, లక్ష్మికి రెండో ఏట పెళ్లి జరిగినప్పటికీ, అది నిక్షేపంగా పెళ్లే, సంప్రదాయాన్ని గౌరవించాలి - అని విలన్ పక్షంగా తీర్పు చెబుతుంది. లక్ష్మి రంగలకు చుక్కల పర్వతంమీద పెళ్లి జరిపిస్తానని శపథం చేస్తుంది సత్యవతి. విలన్ మనుషులతో హీరో సాహస యుద్ధం చే సి న ప్పు టి కీ.

ప్రేయసీ ప్రియులు రక్తపు మడుగులో కన్ను మూస్తారు. అది పూర్వజన్మ వృత్తాంతం. ఈ జన్మలో కోటీశ్వరుని (సత్యనారాయణ) కుమారుడు రాము (నాగార్జున్), పుస్తకాల షాపు అమ్మాయి జానకిని (విజయశాంతి) ప్రేమిస్తాడు; తండ్రి అభ్యంతరం చెప్ప డమే గాక, కిరాయి రౌడీలను ఈ ప్రేమికుల పైకి వుసి గొల్పుతాడు. మోటారు సైకిలు మీద ఆత్మసఖి నెక్కించుకు బ్రిడ్జిపై నుంచి నీటిలోకి దూకిన హీరో, ఈదుకుంటూ తన ప్రేయసితో బాటు ఒక తీరం చేరుకుం టాడు. సూర్యోదయంతో, అలిసిపోయి న ఆజీవుల కనురెప్పలు విడివడతాయి. చుక్కల పర్వతం ఎక్కుతారు. వెన కొకసారి మనం యిక్కడి కొచ్చినట్టు న్నామే - అనుకుంటారు యిద్దరూ. నిరీక్షణలో ముసలిదైన సత్యవతి సన్నాయి బత్తుని శిష్యుడు (వేలు) కని పించడంతో వెనకటి లక్ష్మీ రంగలే జానకీ రాములై జన్మించారని అను కోవాలి. 'వెనుకొకసారి యిక్కడి కొచ్చామే' అనే భావన సైకాలజీకి సంబంధించినది - దానికీ హిందు వులు నమ్మే పూర్వజన్మ సిద్ధాంతానికీ ఏమీ సంబంధంలేదు. దర్శకత్వం: రాఘవేంద్రరావు. నిర్మాత : మురారి.

## మహేశ్వరీ వారి 'చిక్కడు - దొరకడు'

అబద్ధాలు చెప్పడం జేబులు కొట్ట డంలో పట్టభద్రుడైన ఒక రాజాకి (రాజేంద్ర ప్రసాద్), అదేమాదిరి వృత్తి లోని అందాల భామ రాణి (రజని) అన్ని విధాలా జోడు. ఇతనిని లక్ష రూపాయిల రేటుమీద దుష్టత్రయం (సత్యనారాయణ మున్నగు వారు) గాయత్రీ దేవిగారి రెండవ కుమారుడు దిలీప్‌గా నటించమనగా, అదే గాయత్రి దేవి గారింట్లోని సూర్యకాంత మణిని కాజేసేందుకు రెండు లక్షల రేటు మీద, జాకాల్ (దుష్టత్రయంతో ఒకరు) ఆదేశ ప్రకారం వినియోగి స్తాడు - ఈ జేబుదొంగల కాలేజీ ప్రిన్సి పాల్ (గొల్లపూడి మారుతీరావు). దుష్టత్రయం గాయత్రీదేవి సోదరులు. పెద్ద మేనల్లుడిని పరలోకానికి పంపిం చారు; అమెరికా నుంచి తిరిగొచ్చిన రెండవ మేనల్లుడు దిలీప్‌ని కూడా పైలోకానికి పంపేసి, ఆ హత్యా నేరం రాజాపై నెట్టేందుకు కుట్ర పన్నగా, చెడుపనులు చేసినప్పటికీ స్వభావ రీత్యా దుష్టుడూ వంచకుడు నీచుడు గాని రాజా ద్వారా ఈ హత్యోంద తాన్ని వెలికి లాగుతాడు ఇనస్పెక్టరు (రంగనాథ్). రేలంగి నరసింహారావు దర్శకత్వమవడం వల్ల నవ్వు పువ్వు లలోటులేదు. కాశ్మీరు దృశ్యాలు నేత్రోత్సవంగా ఉన్నాయి. కవ్వింపు పాటలు మామూలే! నవ్యత లేక పోయినా ఎంటర్‌టైన్‌మెంటు ఉంది. నిర్మాత : వెంకన్నబాబు.

## పద్మప్రభు వారి 'ఇంటింటి భాగవతం'

ఇదరు అప్రయోజకులైన కొడుకులు, సమర్థుడైన ఒక పెంపుడు కొడుకు, విశ్వాస పాత్రుడైన ఒక నమ్మిన బంటూ గల సత్యమూర్తి (దాసరి నారాయణ రావు) లోకం దృష్టిలో, యింట్లో వాళ్ల దృష్టిలో వట్టి పిసినారి. స్విమ్మింగ్ పూల్‌కి విరాళ మివ్వని కారణాన, ఊరి పెద్దలు 'లోభశ్రీ, అనే బిరుదు కూడా యిస్తారాయనకు బహిరంగ సభలో! తమాషా ఏమిటంటే ఆయన ఆ బిరుదుని హాయిగా నవ్వుతూ స్వీకరిస్తాడు. పోస్టాఫీసు గుమస్తాకి తప్ప మరెవరికీ తెలియకుండా ప్రతినెలా పాతిక వేలు వేర్వేరు వ్యక్తులకీ, సంసలకీ గుప్త దానం చేసే ఆ పెద్ద మనిషికి డబ్బుకంటె ముఖ్యమైనది కృషిఅనీ, ఆ కృషి ఫలితమే సంపద అనీ సుస్పష్టంగా తెలుసు. త్రిశంకు స్వర్గాధిపతి అయిన విశ్వామిత్రునితో (మోహన్‌బాబు) చేతులు కలిపి, తన అప్రయోజక కుమారులే తనని అంత మొందించగా, 'రాదారి - గోదారి' తత్వచింతనలో పడితేరుకు, తమ్ముడు భూషణ్ వేషంలో పునర్ దర్శనమిచ్చి, రోజు కూలీ చేసుకుంటున్న కొడుకులని ఆదుకు, విశ్వామిత్రుని పోలీసులకి వొప్పగిస్తాడు. సత్యమూర్తిపాత్ర తప్ప మిగతావన్నీ బుట్ట బొమ్మలు. ధాసరి ద్విపాత్రాభినయం కోసమే చూస్తారు ఈ చిత్రాన్ని. దర్శకత్వం : ధవళ సత్యం. సమర్పణ : దాసరి పద్మ.

## గోపీకృష్ణా వారి 'ప్రాణ స్నేహితులు'

సర్వ సామాన్య బంధుత్వాల కంటె స్నేహ బాంధవ్యం ఎంత గొప్పదో చెప్పే ఈ చిత్రంలో, కుమార్ ధనవంతులబ్బాయి ; శంకర్, ఆత్మాభిమానం గల పేదబాలుడు. మమతకు కరువు వాచి వున్నాడు ధనిక బాలుడు ; చుట్టూ పేదరికం తండ్రి జ్ఞాపకాలూ ఆవరించివున్నా, తల్లీ చెల్లెళ్ల ప్రేమ ప్రసూనాల లతానికుంజంలోకి ఒక యాదృచ్ఛిక ఘటన కారణంగా, ఈ ధనిక బాలుడు కుమార్ ప్రవేశిస్తాడు. శంకర్ తల్లే యితని తల్లి అవుతుంది ; శంకర్ చెల్లెలే యితనికి చెల్లెలై రాకీ కడుతుంది. కుమార్ (శరత్‌బాబు) ప్రేమించిన అమ్మాయి (అరుణ) విషయంలో శంకర్ (కృష్ణంరాజు), ఆ శంకర్ ప్రేమించిన అమ్మాయి (రాధ) విషయంలో కుమార్ మంతనాలు జరుపుతారు ; పెళ్ళిళ్లవుతాయి. అయితే, ఒక విలనూ, కుమార్ తండ్రీ పన్నిన పన్నాగ ఫలితంగా ప్రాణస్నేహితులలో ఒకరు పగ బడతారు ; మరొకరు త్యాగామృతంతో ఆ పగని చల్లారుస్తారు. శంకర్ నిశానీ దారు కానక్కర్లేదు ; ఆ మోసం అంత అవాస్తవికమైన గ్లామర్‌తో జరగనక్కర్లేదు. స్నేహానికి పట్టం గట్టే ఈ చిత్రానికి దర్శకులు మధుసూదనరావు. నిర్మాత : శివకుమారి. సమర్పణ : సూర్యనారాయణరాజు.

?

"When the three Queen Mothers and Bharata came with profound apologies for all what had happened and begged of Rama to come back to Ayodhya, why was he so adamant? Don't tell me he had to live up to his avatar..."

Raghu's father smiled within himself and said: " would remind you that even great Rama was bound by the Divine Code of Ethics which we call Dharma."

"Father, you are confusing me with that word Dharma," complained Raghu.

"No, my boy, Dharma is above Jurisprudence, above Law and Justice. Shall I tell you what Rama's reply was?... 'Viswamitra opened my eyes to the horror and cruelty of this world. Material and sensual appetites drive you towards the Citadel of Power. No doubt Power has its proper place but a Prince should maintain that perpetual Balance of Power betweenhimself and his subjects. Without arrogance or authority this Power has to be exercised in the path of least resistance and forget not that a Ruler assumes this Power to Rule by Divine Grace - otherwise known as Dharma. Brother Bharata, this Dharma is neither a paradise nor a dreamland but you have to carry on the tasks of administration till such time I return fulfilling the filial obligation. We are all bound by this Code of Ethics which has been handed over to us by our forefathers.'... When Rama spoke with such erudition and persuasive command, Sage Vasista felt speechless and advised the party to return home."

*Swadharma Swaarajya Sangha*
**Director : BVSS Mani**
*'Beehive' Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*
(*Ph. 514477*)

 

సీరియల్

# మజిలి

## అన్నపూర్ణా రెడ్డి

గడిచిన కథ : అన్నగారైన డాక్టరు సారథిని చూడటానికి తన పిల్లలతో వచ్చింది గాయత్రి - ఆ మారుమూల పల్లెటూరికి ! ఆ యింట్లో వున్న జానకిని అన్నగారి పిల్లలు 'పిన్నీ - పిన్నీ' అని పిలుస్తున్నారు. అన్నగారేమో జానకికి ఈ యింట్లో గల స్థానమేమిటో, ఎటువంటిదో చెప్పడు. అదేమిటో తెలుసుకోవాలనీ, తేల్చుకోవాలనీ గాయత్రికి ఆత్రంగా ఉంది .... (ఇక చదవండి

"దాని దేముందండి.... ఈ వేళ మధ్యాహ్నం మిమ్మల్ని మండలి సభ్యులకు పరిచయం చేస్తాను.... అక్కడి కార్యకలాపాలు చూద్దురు గాని.... అయినా ఇక్కడ ఇంకా మండలి కోసం భవన నిర్మాణం అదీ ఏమీ ప్రెసిలేదండి. పెద్దరెడ్డిగారి కోడలు చేయడెంటు - వారి లోగిలిలోనే మండలి సమావేశం అవుతుంది. మీ బోటి పెద్దలు మా మండలి దర్శిస్తే మాకే మేలండీ. తెలియని విషయాలెన్నో తెలుసుకోవచ్చు." తలవాల్చుకొని మెల్లగా చెప్పింది సౌదామిని.

తనకువ్యక్తిగత ప్రాధాన్యం లభించబోతోందని తెలుసుకున్న గాయత్రి ముఖం నిండా నవ్వు పులుముకొని,.... "అలాగే".... అని సమ్మతి తెలియచేసింది.

నిమ్మరసం రెండు గ్లాసుల నిండా తెచ్చి అందించింది జానకి.

నిమ్మరసం కొద్ది కొద్దిగా గుటక వేస్తూ జానకి వంక ఓ కన్ను వేసి వుంచింది సౌదామిని. ఆ కళ్ళల్లో ఎన్నెన్నో భావాలు కదలి వెళ్ళాయి.

"ఏయ్. మా కేదీ నిమ్మరసం.... గొంతు ఆర్చుకు పోతోంది.... ఇంట్లో ఇక్కడ ఫ్రిజ్ కూడా లేదు." గాయత్రి పెద్ద పిల్లలిద్దరూ వంటింటి మీద దాడి చేశారు. వాళ్ళకు రసం పోసి ఇచ్చింది జానకి.

"సాయంత్రం నాలుగంటలకు వస్తానండీ" అంటూ సెలవు పుచ్చుకుంది సౌదామిని....

## 7

ఆ సాయంత్రం గంట ముందుగానే అలంకరణ మొదలుపెట్టింది గాయత్రి. ఎత్తుగా సిగచుట్టి చుట్టూ పూవులు ముడిచింది. జరీ బుట్టా వున్న ఆకాశం రంగు పట్టుచీర, మేచింగ్ బ్లౌజు ధరించి అవే రంగు గాజులు, బొట్టు, సరిపడేన గల సెట్ వేసుకుంది. గోడకు వేలాడే

బుల్లి అద్దంలో వంద మార్లయినా ముఖం చూచుకుంది.

పిల్లలకు ఒకే రకము బట్టలు ధరింప చేసింది బెల్ బాటమ్ పేంట్లు షర్టులు తొడిగి ఎత్తు మడమల బూట్లు వేసుకొని ఇంట్లోకి వీధిలోకి అసహనంగా తిరుగుతూ కబుర్లు చెప్పుకొంటూ మధ్య మధ్య బట్టలు సవరించుకుంటున్న పిల్లలను, నారిగాడు చింతచెట్టు క్రింద మట్టిలో కుర్చొని, వారి వంక చూడ సాగాడు.

"కొండముచ్చుగాడు చూడు, ఎలా వున్నాడో" - చైతన్య కిసుక్కుమంది. తల తిప్పేసుకున్నాడు వాడు.

గూడు బండి వచ్చి ఇంటి ముందాగింది. అందులోంచి సౌదామిని క్రిందకు దూకి "రండి మేడమ్ వెళ్లాము" అంది.

మరోసారి అద్దంలో చూచుకొని పిల్లలు వెంట రాగా వేనిటి బేగ్ అంది పుచ్చుకొని బండి కేసి నడిచింది గాయత్రి.

అసలు, మువ్వల చప్పుడు వినగానే గాయత్రి ముఖం అసహనంతో నిండిపోయింది.

తనవంక, బట్టలవంక, బండివంక, చూచి "సరే వెళ్దాం రండి" అంది తప్పదన్నట్టు.

అవిడ దురవస్థ గమనించి తగు బల్ల తెచ్చి వేసింది జానకి.

పిల్లలు బిల బిల మని ఎక్కేశారు బండి.

గాయత్రి బండిలో కూర్చోగానే రయ్యిన దూసుకుపోయింది బండి.

పల్లపు వీధిలో వున్న ప్రెసిడెంట్ గారింటి ముందాగింది బండి.

లోపలి నుండీ పది మంది దాకా స్త్రీలు, అన్ని వయసుల వారూ వచ్చి గాయత్రి చుట్టూ మూగారు.

అందరూ ఒంటి నిండా తమకున్న నగలు దిగేసుకొని పట్టుచీరల్లో నైలెక్స్లల్లో ముచ్చట ముడుల్లో రకరకాల అలంకరణలు చేసుకొని అందానికి మెరుగులు దిద్దుకొని హుషారుగా వున్నారు.

మండలి ప్రెసిడెంట్ సుబ్బమ్మ ముందు కొచ్చి "రండి" అంది.

చీకటి గుయ్యారం లాటి హాల్లోకి వచ్చి కూర్చున్నారంతా.

సౌదామిని పేరు పేరున పరిచయం చేసింది.

'నవరత్నం సెక్రటరీ, వీళ్ళంతా సభ్యులు ఇంకా ఇద్దరు ముగ్గురు పొలాల్లో పనికెళ్ళారు" అంటూ.

తాతల నాటి తివాచీ బల్ల, దాని చుట్టూ చెక్క కుర్చీలు.

కూర్చుంటే బట్టలు పాడయి పోతాయన్నట్టు ముళ్ళ మీద కూర్చుంది గాయత్రి. పల్లెటూరంటె అంతో ఇంతో చదువుకున్న వాళ్లుంటారని, వాళ్ళతో కాస్త కాలక్షేపమే కాకుండా, తన హెూదా అంతస్తు ప్రదర్శించవచ్చునని ఉవ్విళ్ళూరిన గాయత్రికి నిరాశ కల్గింది.

ముగ్గురు పిల్లలను తలా ఒక అమ్మ కబుర్లలోకి దింపి వాళ్లు చెప్పే గొప్పలను నోళ్ళు వెళ్ళ బెట్టుకొని విన్నారు.

నవరత్నం చిన్నతనానే తల చెడ్డ మనిషి. ఒకప్పుడు బాగా బ్రతికిన కుటుంబమే అయినా, భర్త పోయే నాటికి అప్పులే మిగలడంతో, అయిన వాళ్ళ ఎదుట మొండిగా బ్రతకలేక గరికపాడు చేరి, అప్పడాలు వడి యాలు చేసి, విస్తళ్లు కుట్టి, చిన్న చిల్లర దుకాణం నడుపుకొంటూ గుట్టు గా బ్రతుకుతూంది. స్కూలు కెళ్ళి వచ్చే పిల్లల్ని దారినపోయే పిల్లలను చూడ్డము, వాళ్ళనేదో కవ్వించడము, వాళ్ళేమన్నా ఎదురు తిరిగి అంటే తిట్టడము నవరత్నం దిన చర్యలో భాగం.

నవరత్నం, గాయత్రి పిల్లలను చూస్తూ రోజూ దారిలో చూచే డాక్టరు గారి పిల్లలను మనసులో గుర్తు తెచ్చు కొంటూ మౌనంగా వుండిపోయింది.

'నవరత్నం.... ఏమిటాలోచన ?' భుజం మీద చేయి పడేసరికి ఉలిక్కి పడ్డట్లు 'ఆ' అంటూ చుట్టూ చూచింది.

అంత బల్ల చుట్టూ కూర్చొని వున్నా రు. అందరి ముందూ మోదుగ ఆకుల్లో ఓ బజ్జీ, బోండా, కారప్పూస వున్నాయి.

తళతళలాడె ఇత్తడి గ్లాసులో మంచి తీర్థం పోస్తూ సౌదామిని, - కారప్పూస నవరత్నం చేశారండీ. బోండా మున సబు గారింట్లో చేయించాము. బజ్జీలు సుబ్బమ్మ గారు చేయించారు - అంది.

ఆ పదార్థాలు చూస్తూంటే ఛ.... ! ఛ.... ఉత్త అనాగరికులు వుత్త నూనె కంపు.... వీరి పల్లెటూరి అభిరుచీ వీళ్ళూను. నేను ఎల్లుండి పార్టీ ఇస్తాను వీళ్ళకు.... అప్పుడు చూపిస్తా మంచి వంటకాలేమిటో ! మనసులో నిశ్చ యించుకుంది గాయత్రి.

ముఖానికి చిరునవ్వు పులుముకొంది గాయత్రి. ముక్క తుంపి నోటిలో వేసు కొంటూ పిల్లల వంక చూచింది.

'అబ్బ ! కారం....' అంటూ తుపు క్కున వుమ్మేసింది చైతన్య.

చిన్నబాబు ఎవరి చంకలోనో ఎక్కి వున్నాడు. శీను మాత్రం సుష్టుగా మరి రెండు బోండాలు వేయించుకొని తింటు న్నాడు.

పార్టీ తరువాత సభ్యులంతా భజన గీతాలు పాడారు. తాము అల్లిన కుట్లు అల్లికలు చూపించారు.

తన వేనిటీ బేగ్ నుండీ నిట్టింగ్ నీడిల్స్ తీసి స్వెట్టర్‌కు అల్లుతూ వది లేసిన అల్లికలు వాళ్లు చెప్పే కబుర్లు వింటూ, అందరినీ కలియ చూస్తూనే యాంత్రికంగా నిట్ చేయ సాగింది గాయత్రి.

సభ్యుల కళ్ళన్నీ గాయత్రి వేళ్ళ మీదే వున్నాయి. గాయత్రి అసలు అల్లిక వంక చూడ్డం లేదు.

అక్కడున్న కాస్సేపట్లో తెలిసి పోయింది వీళ్ళకేం రాదని.

వాటి వంక చూచుకొని "మీ అంద రికీ థాంక్స్.... ఎల్లుండి మధ్యాహ్నం మా యింటికి రండి మీరంతా. మీరు మీ మండలిలో ఇంకా ఇంకా ఏమేమి కార్యక్రమాలు నిర్వహించవచ్చో చెపు తాను" అంది గాయత్రి.

డాక్టరు గారింటికి వెళ్ళడం అనే సరికి అందరూ ఏ పేచీలేకుండా తలూ పేశారు. (ఇంకా వుంది

# స్వాతంత్ర్య పత్రం

గడిచిన కథ: థామస్ పెయిన్ 'కామన్ సెన్స్' అనే నవ కరపత్రం ద్వారా సంచలనకారయాడు 'డిక్లరేషన్ ఆఫ్ ఇండిపెండెన్స్' ముసాయిదాని ప్రతిదీ జఫర్సన్ తయారుచేయగా, జులై ఒకటో తేదీన ప్రతినిధుల వాగ్వ్యాదం ప్రారంభమయింది. (ఇక చదవండి

"మాలో కొందరు ఇంగ్లండు నుంచి సమాచారము తెలిసేదాకా వేచి వుందామనే అభిప్రాయంలో వున్నారు. మిగతా వారు సీజర్ని మించిన సాహసంతో ఈ కల్లోల సముద్రాన్ని కాగితపు పడవలో దాటగలమని భావిస్తున్నారు. అది మన ప్రజలకు క్షేమకరమా అని నేను సంశయిస్తున్నాను. పాలకులు మనపట్ల చూపుతున్న అన్యాయమూ, మన విన్నపాల పట్ల వారు కనబరుస్తున్న అలక్ష్యమూ గమనించతగ్గవి. కాని అందుకోసమని మనమొక తుపానులోకి దూకడము శ్రేయస్కరమా? నేనింతకీ చెప్పేదేమిటంటే కొంచెము వేచివుండండీ అని. ఈ తాల్మివల్ల మనకేమీ నష్టము కలుగదు. ఫ్రాన్సుకి మనము పంపుకున్న వుత్తరాలకు కనీసము తగు జవాబైనా రానివ్వండి" అని నొక్కి వక్కాణించాడు డికెన్సన్. కనెక్టకట్ రాష్ట్రానికి చెందిన సైలాస్ డీన్ మూడు నెలల క్రితం ఫ్రెంచి ప్రభుత్వంతో రహస్య సమాలోచనలు జరిపి ఆయుధ సామగ్రిని సేకరించేందుకు వెళ్లినట్లు ప్రతినిధులందరికీ తెలుసు.

వర్షపు చినుకులు పడుతున్నాయి. గాలి ముమ్మరముగా వీచినప్పుడల్లా ఆ వర్షపు చినుకుల దడదడ వారికి వినిపిస్తోంది. ఫ్రాన్సుని ముందే మంచి చేసుకోకపోతే, తమకి జరగగల వుపద్రవము గురించి వివరిస్తున్నాడు డికెన్సన్: 'మనము ఈ స్వాతంత్ర్య పత్ర ప్రకటన ఫలితముగా బ్రిటన్తో యుద్ధానికి దిగినప్పుడు, ఫ్రాన్సు మన మిత్రరాజ్యంగా వుండక, గోడమీద పిల్లివాటంగా వుంటే, మనకి ఎంత నష్టమో ఆలోచించారా? కెనడా తమకి స్వాధీనం చేసేదాకా బ్రిటన్కి యిబ్బందులు తెచ్చిపెట్టి, కెనడా స్వాధీనమయాక బ్రిటన్ ఫ్రాన్సులు కలిసి మన ఈ స్వాతంత్ర్యోద్యమాన్ని ఒక్క తృటిలో నలిపి వేస్తాయి.' .... ఇది రాజనీతిజ్ఞులు ఆలోచించవలసిన విషయమే, తన శక్తిని కూడ దీసుకునేందుకు ఫ్రాన్సు ఆ ప్రకారము వ్యవహరిస్తూందనుకోడంలో పొరబాటేమీ లేదు. కెనడా తమ హస్తగతమైన తక్షణం, ఫ్రాన్సు బ్రిటనుతో చేయా

చేయీ కలిపి అమెరికను వలసలని పాదాక్రాంతము చేస్తుంది.

జాన్‌యాడమ్స్ చేతులు కట్టుకు కూచుని ఓట్లు ఏ ప్రకారము పడతాయా అని లెక్కిస్తున్నాడు, పదమూడు వలసలలోనూ యింకా భేదాభిప్రాయము చాలా వున్నది. పదమూడు వలసలూ ఐక్యకంఠంతో యీ తీర్మానాన్ని ఆమోదించిన నాడే - యిది పటిష్టవంత మవుతుంది. లేనినాడు యిది నిరుప యోగము.

డికెన్సన్ తన వుపన్యాసం చివరి భాగానికి వస్తున్న కొద్దీ ప్రతినిధులను వుద్దేశించి గాక జాన్‌యాడమ్స్‌ని దృష్టిలో పెట్టుకుని అతనినే వుద్దేశిస్తు న్నట్లు ప్రసంగించ నారంభించాడు. ఒక వినాశకరమగు కుట్రనుంచి వారందరినీ కాపాడవలసిన సంరక్షకునివలె మాట్లాడాడు. "యుద్ధ మనగానే భయానక పరిణామాలు సంభవిస్తాయి. అతి క్రూరంగా మనపై దాడి జరుపుతారు. మనము కష్టపడి నిర్మించుకున్నవన్నీ ధ్వంసమవుతాయి. ఆదిమ వాసులని మనపై కయ్యానికి వుసి గొల్పుతారు. ఇటువంటి క్లిష్టసమయం లో స్వాతంత్ర్య ప్రకటన, కొత్త ఇల్లు కట్టుకోకుండా పాత యింటిని తగల పెట్టడం వంటిదవుతుంది మీరు మీమీ రాష్ట్రాల ప్రజలకు ఏమని సంజాయిషీ చెపుతారు ? ఈ అరాజక పరిస్థితులకి వారు సంసిద్ధముగా వున్నారా ? మన తొందరపాటును వారు అంతరాంతరంలో నిందిం చరా ? వలసలన్నీ ఒకటై, మనలో గల కలతలు సమసిపోయాక, ఐక్య కంఠంతో శత్రువుని ఎదురించాలే తప్ప యిన్ని తగవులూ వివాదాలతో బలి వంతుడగు శత్రువుని ఎలా జయించ గలమని ఈ ప్రతినిధులు అను కున్నారని, ప్రజలు మనని ప్రశ్నిం చరా ? విప్లవకారుల ఆశలకు ప్రతిఫలము ఉరికంబ మవుతుందేమో నని నాకు భయముగా ఉంది."

డికెన్సన్ తను చెప్పదలచుకున్న వివరాలన్నీ చెపుతూ వుండగా, జాన్‌యాడమ్స్ తనలో తను ఆలోచించుకో సాగాడు. అవును. నిజమే. ఈ దేశపు కర్షకునికి, ఈ అలజడి ఎందుకు జరుగుతున్నదో చెప్పవలసిందే ! కాని, ఈనాడు కర్షక కార్మికులు కొత్తగా తెలుసుకోవలసినది ఏమున్నది ? గత ఆరు నెలలుగా ఈ వ్యవహారము నలుగుతూనే వుంది.

ఒక గంట క్రితమే మేరీలాండ్ నుంచి సామ్యూల్ ఛేజ్, యాడమ్స్ పేర ఒక లేఖ పంపాడు. ఇంతవరకూ యిటూ అటూ వూగిసలాడుతున్న మేరీలాండ్, స్వాతంత్ర్య తీర్మానానికి సుముఖముగా వోటు చేసేందుకు అంగీకరించింది. గత పదిరోజులుగా సామ్యూల్ ఛేజ్, మేరీలాండ్‌లోని వ్యవసాయ క్షేత్రాలు పర్యటించి అక్కడి ప్రజాభిప్రాయం తెలుసు కున్నాడు. (ఇంకా వుంది

**మాతృక: కార్నెల్ లెన్‌గ్వేల్**
**తెలుగు : యన్నార్ చంద్రూర్**

